# త్రివర్గము.

(తిరుక్కుఱళ్)





విద్వత్కవికులతిలక

పూతలపట్టు శ్రీరాములురెడ్డి.

# పీఠిక.

ఈ కురళ్ అను ద్రవిడ ద్విపద కావ్యమందలి ముఖ్య విషయము ధర్మార్థ కామములు కావున దీనికిఁ దెనుఁగున త్రివర్గమని పేరిడితి. ఇది అఱవమున సుమారు రెండువేల యేండ్లకు మునుపు (కడపటి మధుర సంఘ కాలమున) తిరువళ్లువర్ అను మహనీయునిచే వ్రాయఁబడినది. అతఁడు మైలాపూరున పుట్టి పెరిఁగిన వాఁడని చెప్పుదురు. తల్లి దండ్రులు ఆదియమ్మ, భగవానుఁడు అని అతని చరిత్రమును క్రింది రీతి వింతగా చెప్పుదురు. భగవానుఁడను బ్రాహ్మణ బ్రహ్మచారి తీర్థయాత్ర చేయుచుండి యొకచోఁ నొక బ్రాహ్మణుని యింట నతిథియై నిలిచి యటవారిచే పెంపఁబడుచుండిన యొక కన్యకను వివాహమాడెను. ఆ పడుచు మాలపడుచఁట! ఎవ్వరికిం దెలియదఁట! వారి కేడుగురు బిడ్డలు పుట్టిరి. గృహస్థులయ్యు యాత్ర మానక చేయుచుండిన యా దంపతులా బిడ్డల నొక్కొక్కరిని పుట్టిన చోటనే దలుచుఁ బోయిరి. భర్తయాజ్ఞచే విధిలేక వదలియు వదలఁజాలని మనసుతో వగచు తల్లికా నిసువు లిట్లనిరఁట!

౧ ఈ తీరున నానొసట వ్రాసిన పరమేశ్వరుఁడు మరణించెనా యేమి? కలదైనను వానికే భారము. తల్లీ! చింతిల్లకు.

౨ ఏనుఁగు మొదలు చీమవఱకు నన్నింటిని ప్రేమతో బ్రోచు నీశ్వరుఁడు ప్రోడ. ఏమఱఁడు. తల్లీ! చింతిల్లకు.

3 పిండమునకు గ్రుడ్డునకు ఱాతిలోని కప్పకు నాహారమిడుచున్న యీశ్వరుఁ శరీర మొందిన నన్ను రక్షింపకుండునే? తల్లీ! చింతిల్లకు.

౪ తల్లి భుజించిన యాహారము మావిలోని పేశిని పెంచుచున్నది. జీవితమే వింతయైనది. ఈశ్వరుని మహిమ యిట్టిదని యెఱుఁగుము. తల్లీ! చింతిల్లకు.

౫ దుర్గమారణ్యమున నొకరాతిలోని మండుకమునకు కడుపు నించుచున్న లోకేశ్వరుఁడు నన్నును కాపాడక పోఁడు. అతని కసాధ్యము లేదు. తల్లీ! చింతిల్లకు.

౬ తల్లి కడుపున మావిలోనున్నపుడే యాహారమిచ్చిన కృపాళుఁడు పుట్టినపిదప వదలునే? తల్లీ! చింతిల్లకు.

౭ సర్వజ్ఞుఁడు సర్వాంతర్యామియగు నీశ్వరునకు నేను దూరమునలేను. కానున్నది కాకమానదు. తల్లీ! చింతిల్లకు.

విడువఁబడిన బిడ్డలు కన్నవారిచేఁ గైకొనఁబడి కన్నవారికంటె మిన్నగాఁ గాపాడఁబడి వృద్ధినొంది అవ్వ, ఉప్ప, అధిగమ, ఉఱవ, కపిల, వల్లి, వళ్లువ అను పేళ్లతో నుత్కృష్టజన్ములై లోకఖ్యాతిఁ గాంచిరి.

వళ్ళువులను నొక తెగవారు ఆదిద్రావిడులలో పురోహిత వృత్తితో నున్నారు. వారింబట్టి యెవ్వరో పైకథ కల్పించియుందురని కొందఱందురు. ఇట్టికథలు మాఘకాళిదాసాది మహాకవులకును అంటఁగట్టి యున్నారుకదా! ఈ కవి జైనుఁడనియే పెక్కండ్ర యభిప్రాయము.

వళ్లువరు మైలాపూరున పెరిఁగి పెద్దయై విద్యల నభ్యసించి వాసుకి యను శీలవతిం బెండ్లియాడి గృహస్థుండై యన్నిటిలో నేఁత నేసి జీవించుట పాతకదూరమగు వృత్తియని నిశ్చయించి యాయూరనుండిన ఏలేలసింగఁడను సముద్రవ్యాపారియొద్ద నూలు తెచ్చి నేసి యతనికే యొసఁగి కూలిగొని సంతృప్తిమెయిఁ గాలము గడపుచుండెను. ఇతనిఁగూర్చి వినవచ్చు కథలు పెక్కులు. అందొకటి.

ఒకప్పుడొకసాధువు ఉత్తమ మది గార్హస్థ్యమా సన్న్యాసమా? యని యెఱుఁగఁగోరి వళ్లువ మహాశయుని [illegible]సి యడుగ నతఁడు వెంటనే బదులీయక భార్యనించుక దగ్గఱగఁ బిలిచెను. ఆమెయు లాగుచుండిన చేఁదత్రాటి

నట్టెవిడిచి తొరతొరవచ్చి నిలిచెను. నేయుచుండఁగా నాడె క్రిందఁబడినది. దీపముగొని రమ్మన పట్టపగలు దివ్వెయేల యని బదులాడక యాసాధ్వి వెంటనే కొనితెచ్చెను. అతిథికి వేఁడియన్నమిడి తనకు చలిది యిడుమన నామె యట్లేచేసెను. తనకును అన్నము వేడియైయున్నది. విసరుమన నా పుణ్యవతి మాటాడక విసరసాగెను. ఇట్టి కార్యములు పెక్కులు గమనించి యావచ్చినసాధువు ఇట్టి సాధ్వి యిల్లాలగు వానికి స్వర్గమేల? యనుకొని మరల ప్రశ్నింపక మరలెను.

పతియాజ్ఞకు బదులాడక యతని చిత్తము ననుసరించు నిర్మలచిత్తయగు వాసుకి ప్రతిదినము నాథుఁడు భుజించునపుడతని యనుమతిమేరకు చిన్న గిన్నెయు నందించుక నీరును చిన్నసూదియు నుంచుచుండెడిది. దానికిఁ గారణమామె యెఱుఁగదు. తన యవసానదశలో భర్త తనతలకడఁ గూర్చుండి 'నీకేమి కోరికకలదు తెలుపు' మన నాసాధ్వీలలామ, 'నాథా! నిత్యము భోజన వేళకు పాత్రముకడ నుంచుచుండిన గిన్నెజలము సూదులకు కారణ మెఱుఁగ లేకయే మరణింపఁగలుగు చుంటి ననుచింతగలదు' అనుడు నతండును చింతతో 'చిందిన మెతుకులను సూదితోఁ గ్రుచ్చియెత్తి నీటఁదుడిచి మరల పాత్రమున నుంచుకొనఁదలచి యట్లుంచు మంచుంటిని. కాని యట్టి యవసరము నీవలన ఘటిల్ల దయ్యె' నని పలుక నామె తృప్తిచెంది భర్త చేతుల మీఁద తన ప్రాణములు వదలెను. ధీరచిత్తుఁడయ్యు నతడప్పుడు "నా యిష్ట మెఱిఁగి రుచిగ వండెడుదానవు. పవిత్రప్రేమమయివి. మృదుసత్య వాక్యవు. నాయడుగు లొత్తుచు వెనుక నిద్రించి ముందుగ లేచుదానవు ప్రాణేశ్వరీ! నను విడనాడితివే? ఇఁక నాకను లెట్లు రేయి నిద్రింపఁగలవు?" అని యశ్రుబిందువులు రాల్చెను.

తన యవసానకాలమున నతఁడు ప్రియశిష్యుఁడై యుండిన ఏలేల సింగనితోఁ దన తనువు మృగపక్షుల కాహారమగునట్లుగా నొక బయలునఁ బడవేయింపుమని యాజ్ఞ యిడి బ్రహ్మనిష్ఠగొనియెను.

ఇట్టి పుణ్యచరిత్రునిచే వ్రాయఁబడినది యీ త్రివర్గము. ఇందలి భావము లల్పాక్షర రమణీయములై యసందిగ్ధములై సమస్తజనాదరణీయము లైనవి. ఇందలి విషయ శీర్షికలు మిక్కిలి యాలోచనముతో నొకటి వెనుక నొకటిగా కారణయుక్తముగా పొందింపఁబడినవి. విషయములును దేశ కాలబాధితములు గాక యెల్లయెడల నెల్లవేళల నొకేతీరున నుండున దగుటచే పెక్కు భాషలలోని కీగ్రంథ మనువదింపఁబడినది.

తెనుఁగున వేమన పద్యములు సుమతి శతక పద్యములు సందర్భవశమున సామాన్యులనోటను వాక్రువ్వఁబడుచున్న యట్లే ద్రవిడమందు కురళ్ పద్యములు సమస్త జనులనోటను ప్రామాణికములుగా వాడఁబడి వేద వాక్యములుగా గారవింపఁబడుచున్నవి.

మఱియు నిది మధురసంఘము వారిచేతను మిక్కిలి కొనియాడఁ బడినది. తత్సంఘవిద్వాంసు లీగ్రంథముపై నిచ్చిన యభిప్రాయములే ఏఁబదిమూఁడు పద్యములుగల తిరువళ్లువ మాల యనఁబడుచున్నది. మఱియు నెందఱో విద్వాంసులు దీనిమహిమను పెక్కు విధముల శ్లాఘించి యున్నారు.

ఒక పండితుఁడు 'ఒక ఆవగింజను తొలచేసి యేడు సముద్రముల నందిమిడ్చియుంచిన తీరునున్నది కురళ్ భావము' లనియెను.

వళ్లువనాయనారు దీనిని రెండడుగుల పద్దెములుగా రచియించుటచే నిది తెనుఁగున ద్విపదగా రచియింపఁబడినది.

దీని నోపికతో పరిశీలించి యిచ్చిన బహుభాషా విశారదులగు శ్రీ వెంకటరాజులురెడ్డి గారికి కృతజ్ఞుఁడ. ఇట్లు,

# అంకితము

సీ. ధర్మంబు భువిని యథాస్థితి నెలకొల్పి
విబుధుల కమృతంబు వేడ్కనిచ్చి
ధరణి తల్లడలేక తగు రీతి నూల్కొల్పి
భక్త సంరక్షణ ప్రభ రహించి
నయమారఁగా సుమనః పక్షము వహించి
రాజసాహంకార తేజ మడఁచి
గురు తమశ్చరగుణ కులము రూపఱఁజేసి
ధర్మరాజస్థితి తనరనిల్పి
దుఃఖతతి నడంపఁ దూకొని బోధియై
కలికితనము పుడమి వెలయఁజేసి
జగములనుసృజించి తగఁ బ్రోచి తుదిని లో
నడఁచు వానిఁ దలఁతు నహరహంబు. ౧

ఉ. బాలకపాళికిం దగిన పద్ధతులన్ బహు పుస్తకంబులన్
బోలఁగ వ్రాసితిం దెలివి పుట్టఁగ నక్షర రాశినుండి ని
ర్వ్యాలగ మంచి పాండితి వరించెడు నంతటిదాఁకఁ బద్ధతుల్
గ్రాలఁగ వాచకంబులు పురాణకథల్ తగు శబ్దశాస్త్రముల్ ౨

శా. గ్రంథంబుల్ రచియించు టెన్నఁదగు కార్యంబైనఁ బ్రోత్సాహ సం
బంధుల్ తక్కువయైరియంచు వచియింపన్ రాదు మాత్సర్య దు
ర్గ్రంథుల్ మిమ్మటుమైరి వాగలకు నీర్ష్యాక్రోధ దుర్మానముల్
సంధుక్షించెడి వారెకాని రసికుల్ కన్పట్టరై రెచ్చఁగన్ 3

మ. ధనికుల్ చూడఁగఁ బారమార్థిక సుచింతాహీనులై యుంద్రు ని
ర్ధనులౌ వారలఁ గొందఱైన రసికుల్ రాజిల్లుచున్నం గ్రియా
ఘనతల్ గానము రెండుఁగల్గినను దుర్గర్వంబు నక్షాంతియుం
గొనువారల్ జగమందు చిత్రములు పెక్కుల్ తెల్పఁగా శక్యమే? ౪

సీ. తనకులంబునవారిఁ దలయెత్తనీరాదు
కొలక గిల్లెదమని పలుకువాండ్రు
తెలిసినవారి రీతిని నటించుచు సొమ్ము
వమ్ము సేయుచునుండు నెమ్మెకాండ్రు
పగల కొంపలఁ గూల్చి పర జీవితమ్మును
దుమ్ము సేయుచునుండు దొడ్డవాండ్రు
న్యాయస్థలంబులే యావాసములుగఁ గై
కొని పేరు వార్జించు గొప్పవాండ్రు

ఇట్టిపనుల హేమా హేమి లెల్ల కడల
దండిగానుండు వారలీ మండలమున
నైన జిల్లేళ్ళ గందంపు ప్రూనికరణి
మంచువలె మందునకెయుండ్రు మహితగుణులు ౫

సీ. నిరతాన్నదాత సన్నియత ప్రతిజ్ఞుండు
వృద్ధిఁ గోరక ఋణమిచ్చు సుగుణి
పరులయాపద తన బన్నంబుగా నెంచి
పరితపించుచుఁ దీర్ప జరుగు నతఁడు
అన్నంబు కోరు నతిథులు సత్రంబు
నందుండ రా యని యరయు ఘనుఁడు
నిఖిల దుర్గుణముల నీఁగఁ ద్రోచిన పుణ్యుఁ
డఖిల సద్గుణముల కాటపట్టు

శాంతిమూర్తి సాత్త్వికమూర్తి సాధుహితుఁడు
పరమ శ్రీరామసేవా సక్తుడగుచుఁ
గొత్తకోట గ్రామంబునఁ గొమరు మీఱుఁ
బ్రేమమయుఁడు రామస్వామిరెడ్డి యతఁడు. ౬

మ. నను ప్రేమంబునఁ జేరఁజీరి విమలా - నందాననం బొప్పఁగా
మనవంశంబున కీవు భూషణమవై - మర్యాద పాటించి యిం
పొనరం గూర్చిన పెక్కుగ్రంథముల న - చ్చొత్తింప కున్నన్ వృథా
చనుఁగాదా? యని మందలించి కరుణా - సంరంభ గంభీరుఁడై ౮

చ. కలసిన యంత యక్కఱకు - వచ్చిన యప్పుడు తీసికొమ్ము చం
చలమగు డబ్బుకై మది వి - చారము నొందకు మచ్చుగూర్చి యం
దులఁ గను లాభమున్ యశము - తోషము నందుము సంతసింతు ని
య్యెల వారియిచ్చు ద్రవ్యమది - యెల్లర మేలొనరింపనే కదా? ౯

ఉ. కొంకక తీసికొమ్మనుచుఁ - గోరిన వేళలఁ గోరినంత ని
శ్శంకముగా నొసంగి కృప - సాయము చేయుటఁబట్టి యేను ప
ల్యంకిక నెక్కినంత ముద మందుచుఁ - బొత్తము లచ్చుగూర్చి యే
యంకిలి లేక లోకహిత - మాదటఁ జేసితిఁ గీర్తి నందితిన్

చ. మొనపున నించుమించుగను - ముప్పది గ్రంథము లచ్చుగూర్చితిన్
ధనము గడించు మార్గములు - తంత్రములుం బరికించి చూచితిన్
మనమున నించుకేనియును - మన్నన గూర్పని వంచు నెంచితిన్
మనమును చంపుకో జడిసి - మానితి వర్తకచింత సంతటన్ ౧౦

చ. కవిమను లేని పొత్తములఁ - గైకొను వెఱ్ఱులు లేర యిక్కలిన్
క్రమమున గ్రంథగౌరవము - గాంచిన పుణ్యులు కొన్నవాన ని
క్కముగను వచ్చు ద్రవ్యమది - గాజుల బేరము భోజనానికే
సమపడు నన్నసామెతయె - సార్థకమై కనుపట్టె నాయెడన్. ౧౧

ఆ. ధనము నిచ్చి కొనెడు - ఘన వదాన్యులకంటె
నురక కొను మహాత్ము - లుండ్రు పెచ్చు
వెఱ్ఱి సెట్టి బేర - మిట్టిందులం బొందు
చందమయ్యెఁ గొన్ని - సమలలోన. ౧౨

క. మొదలు చెడు బేర మిట్టులు
తుదిముట్టకయుండ దొరలె దొరతనమందుం
బదిలములగు శాసనములు
తుదకది విఘ్నేశు పెండ్లి తోయంబయ్యెన్

ఉ. నష్టము నొందుచుంటినని - నాహితబంధుఁడు నెమ్మనంబునన్
గష్టమునొందఁడున్ గసరి - కాదనఁడున్ మది సంతసించుచున్
దుష్టి వహింపుమంచు సమ - దున్నతి నొందెదవంచు నప్పుడున్
స్పష్టముగా వచించు నది - సాధుల శీలము కాదె మేదినిన్ ౧౪

చ. అతని కుమార రత్నమొకఁ - డార్జవ శీలుఁడు తండ్రి శీలమే
ప్రతిఫలమందు కైవడిని - భాసిలు వేంకటరామరెడ్డి య
త్యతులిత సాత్వికుండు పర - మార్థ విచారుల వట్టుగొమ్మ ని
శ్చితమతి బీజధర్మమును - చెట్టు వహింపక భేదమందునే? ౧౫

సీ. తండ్రిచేఁతల కద్దు దగులఁడు సరికదా
మన్నెగూగవ్వఁగఁ బాటు పడుచునుండు
బీదసాదల పాలి పెన్నిధానంబని
ప్రఖ్యాతి వడసిన ప్రణుతగుణుఁడు
పరకాంతలను తల్లి పగిదిఁజూచెడు వాఁడు
పరుల మేలున కాసపడెడు వాఁడు
దాంభిక వేషంబు దలఁపకుండెడువాఁడు
కల యంతలోఁ దృప్తిఁగాంచువాఁడు

పలికిబొంకఁ డొసంగి నొవ్వండుకుంత
అన్ని సుగుణ గణంబుల కాటపట్టు
పృథివి వేంకటరామ సాత్వికసముండు
కోటికొక్కఁడు దొరకఁడు కోరి వెదక ౧౬

చ. అతఁడును నాసోదరా మిగుల - నర్మిలితోడఁ జెలంగువాఁడు నా
హితమును గోరువాఁడు తలఁ - పెంతయొ యంతియ పల్కు పల్కు
వ్రితమునఁ జేఁతయుం దనరు - విస్ఫుట శీలుఁడు తండ్రికంటె నిం
గితమున దొడ్డయై పరులఁ - గేరఁడు నొవ్వఁగ మాటలాడఁడున్ ౧౦

చ. తనయుఁడు తండ్రియుక్ బహు వి - ధంబులఁ జేసిన సాయమే ననుక్
జనులకుఁ జూపఁగల్గినది - చాలిన సజ్జన సంఘ మాన్యుఁగా
ననయము వారు పెట్టిన ప్రి - యంబగు దీపమె మద్గృహంబునక్
గొనకొని వెల్గుచున్నయది - కూరిమి తైలముతోడ నేఁటికిక్ ౧౧

ఉ. ఆ విమలాత్మ ప్రేమ సుతుఁ - డన్నిటఁ దండ్రిని తాతఁబోలి వి
ద్యా వినయ ద్వయంబు మణి - హాటక భాతి రహింపఁగాఁ జిరం
జీవి సుమిత్రశేది గుణ - సేవధియై తగె రామలింగమక్
భావజ సుందరుండు పితృ - భాసిత పుణ్యతపఃఫలంబు నాక్ ౧౨

ఉ. వారి కుటుంబ మెల్లపుడు - వారని తామర తంపరై మహిక్
శ్రీరమణీయ సంపదలు - శిష్ట జనాదన కీర్తి సౌఖ్యముల్
శ్రీరఘువీర శేఖరు న - శేష కృపామతి నొందుఁగాత మం
చే రహియించి శ్రీశు నుతి - యించుచు నుండెద సర్వకాలముక్

ఉ. ద్రావిడ భావయందుగల - ధర్మనిధానము వేదతుల్యముక్
ధీవరపాళి వాక్కులను - తేజలు నానుడి గాఁగ నాకుఅల్
శ్రీవరు సత్కృపక్ దెనుఁగు - చేసితి నీతికిఁ దావలంబునై
పావన మాటఁ దానికిఁ ద్రి - వర్గము నా నభిధాన ముంచితిన్ ౨౦

శా. రామస్వామికిఁ దక్క నేరికిఁ గృతుల్ రాజిల్లఁగా నంకితం
బామోదంబున నీయకుండియును నా - య్యంబొంద నాపై ఘన
ప్రేమంబుంచిన కారణంబున నెత - త్ప్రేమాభి బద్ధుండనై
రామస్వామి కొసంగితిం గృతి త్రివ - ర్గంబుక్ యశోదీప్తికై ౨౧

# రెండవ కూర్పు

ఈ కూర్పున కవకాశము లభించినది అర్థలాభవశ మునఁగాదు. (చూ. అంకితము 10–13 పద్యములు.) ద్రవిడ వాఙ్మయమునుండి నుద్గ్రంథములు పెక్కింటి ననువదించిన నాపరిశ్రమమునం దపారాదరముంచి యన్ని గ్రంథాలయము లందుంచవలసిన ట్లనుమతించి ఆంధ్ర గవర్నమెంటు విద్యా శాఖవారు ఉత్తరువులు దయచేయుటచే వారికి సర్వదా కృతజ్ఞుఁడ.

ఇందు భావ సారళ్యమునకొఱకు కొద్ది మార్పులు కావింపఁబడినవి.

ఇట్లు,

పూతలపట్టు శ్రీరాములు రెడ్డి.

# విషయ సూచిక.

## ౩ కామ కాండము

### పెండ్లికి మునుపు.



### పెండ్లికి పిదప.

# ౧. ధర్మకాండము

## ౧. దైవస్తుతి.

౧ అక్షరంబు లకార మాదిగాఁ గలవి
అక్షరుఁ గలవి యఖిల జగములు

౨ చదువుచే ఫలమేమి సర్వజ్ఞు పూత
పదములకును భక్తిఁ బ్రణమిల్లకున్న

౩ అలరులపై నేగు నతని పాదములు
గొలుచువారు సుఖమ్ముఁ గొంద్రు నతమ్ము

౪ ఆశ నిరాశయు నందని పరము
నాశించు వారల కాపదల్లేవు

౫ స్థిరు మేటిమహిమఁ గీర్తించు వారలను
దరిఁజేర వజ్ఞతం దనరు ద్వంద్వములు

౬ నిర్వికారుని నితి నెఱి నిల్చువారు
నిర్వృతి నుందురు నిచ్చలు తారు

౭ అగుఁగాక యసము పదాశ్రిత తతికి
నగునె చిత్తవ్యథ నణఁప నన్యులకు?

౮ తరియింత్రు ధర్మాబ్ధి తత్పదాశ్రితులు
పెరల కరిది దాఁటఁ బెర జలసిధుల

౯ మొనసి యష్టగుణుని మ్రొక్కని శిరము
నెనసిన యంగంబు లిల నిష్ఫలములు

౧౦ తరియింత్రు భవ మహోదధి భక్తవరులు
తరియింప రజు పద తరణి దూరగులు.

## ౨. వాన మేలిమి.

౧ వానచే లోకంబు వ్యవహార మగుటఁ
దా నమృతమ్మని తగఁ బేరు గాంచె

౨ కుడుచువారికి మంచి కుడుపులఁ గూర్చి
కుడుపుఁ దానయి యొప్పు గూర్చును వాన

౩ వఱపు గల్గిన భూమిఁ బ్రాణిచయంబు
వరటు నాఁకలిచేతఁ బలుపాట్లు గుడిచి

౪ మొగులు కురియకున్న మొనసి కర్షకులు
తగ నేరు దున్ని సేద్యము సేయలేరు

౫ కురియక జీవులఁ గొఁదచేసి చెఱుపఁ
గురిసి పోషింప మొగులె పో వలంతి

౬ పసిమీఱ నిలను వర్షము పడకున్న
పసిమేయు పూరియు బ్రాఁతియౌఁ గాంచ

౭ కురియకుండిన మహాకూపారమైన
వరటి తద్గుణము కీడ్పడుట నిజంబు

౮ నిత్యనైమిత్తిక నియతులు దేవ
కృత్యముల్ జరుగవీ యిలఁ గఱవైన

౯ వానలేకున్న విశ్వంబునయందు
దానంబుఁ దపము నెద్దడి సాగిరావు

౧౦ నీరు లేకున్నచో నిలువదు జగము
నీరున్న నే యెల్ల నియత శీలములు.

## 3. యతుల మహిమ.

౧ శీలంబు కొఱకుఁ ద్యజించిన ఘనుల
మేలెంచి గ్రంథముల్ మిక్కిలి పొగడు

౨ యతుల పేరిమి మెచ్చి యభినుతించుటలు
మృతినొందువారి లెక్కిడుటను పోలు

3 ద్వయగతుల్ తిలకించి తగ వాచరించు
నియతుల మహిమంబు నేటిమేలుచేయు

౪ ధీసృణి వలన నింద్రియ నాగములను
నాసిల్లఁజేయు టెన్నఁగ ముక్తి విత్తు

౫ విజితేంద్రియుల శక్తి వీక్షింప సాక్షి
అజర నాయకుఁడు బలారియే చాలు

౬ ఘటియింత్రు దుర్ఘట కార్యముల్ పెద్ద
లటు చేయలేని వా రల్పులు జగతి

౭ పంచ తన్మాత్రల పద్ధతు లెఱుఁగు
నంచితు నెఱుకకు నడఁగు లోకంబు

౮ తీరైన వశ్యవా గ్ధీరుల మహిమ
వారి యమోఘంపు వాక్కులె తెలుపు

౯ గుణమను కొండపైఁ గూర్చున్న వారి
క్షణ కోపమైనను కాచుకో నరిది

౧౦ అన్ని ప్రాణుల యెడ ననుకూల కరుణ
యున్న పెద్దలె శాంతు లుత్తమ యతులు.

## ౪. తగవు బలిమి.

౧ పరువిచ్చుఁ బేరిచ్చుఁ బరము నొసంగు
నరులకు మేలౌ ధనంబు ధర్మంబు

౨ కలదె ధర్మముకంటె ఘనలాభ గరిమ?
కలదె చెడుగు దానిఁ గడఁద్రోచుకంటె?

౩ తగవు సాధింపంగఁ దగినట్లు యుండెఁ
దగుఁజేయ విడువక తగఁజెల్లు పట్ల

౪ మది దోషములనెల్ల మాన్చుట యొప్పు
నదియ తగవు; పెర లాడంబరములు

౫ కరసు కినుక యాస కడుపూఁద నాల్గుఁ
దఱిమి చేసినయదె తరమైన తగవు

౬ ఆనాఁటికినక చేయందగుఁ దగవు
తాన పీడని తోడు తనయేగువేళ

౭ ఇది ధర్మఫల మననేల? పల్లకిని
కదిసి కాంచుమ యెక్కుఘనుల మోపరుల

౮ తడయక విడుపక తగవాచరింప
యెడఱాయియై యాఁపు నిల మఱుబాము

౯ ఆనంద మది స్వధర్మాప్తి నానేని
కానివి యశమొసంగవు వగ నిడును

౧౦ చేయంగఁదగినది శ్రేయ మొక్కండ
పాయంగఁదగినది పాప మొక్కండ.

# ప్రవృత్తి మార్గము.

## ౫. గృహస్థ జీవితము.

౧ తమ ధర్మములనుండు తక్కుమువ్వురకు
విమలుఁడౌ గేస్తాదవిన దారి తోడు

౨ యతులకు బీదల కతిథుల కరయు
మృతులైన వారికి మేల్తోడు గేస్తు

౩ పితరులు దైవంబు విందు చుట్టంబు
నతఁడను నేవుర నగుఁ గావ గేస్తు

౪ పాప దూరతఁ గూర్చి పంచి భుజించు
నాపుణ్యు మనుగడ కాపద ల్లేవు

౫ అర్హాధర్మము ప్రేమ యలరారునేని
గార్హస్థ్యమున కదే గరిమయు ఫలము

౬ తనధర్మమును గేస్తు తగురీతి నడపఁ
గను మేల్ఫలము లేదు కఠిన తపమున

౭ తనధర్మమున గేస్తు తగురీతి నడవ
మొనసి యమమునొందు ముగురలో మేటి

౮ తనపాడి వీడక తక్కు ధర్మముల
కనువిచ్చుగేస్తు శ్రేయమె బలీయంబు

౯ ఉత్తమ ధర్మమే యుఱిది గార్హస్థ్య
ముత్తమోత్తమ మది యొందదే నగదు

౧౦ భువి ధర్మముల గేస్తు పొనరుగా నడవ
దివిజులలో వానిఁ దేర్చి లెక్కింత్రు.

## ౬ సహధర్మిణి.

౧ శీలంబు పొదువు నే చెలువకుఁ గలుగు
నాలేమ యిలుఱేని కగు మంచితోడు

౨ ఇలువడి లేనట్టి యిల్లాలి తోడి
యిలుఱేని మనికి మేలెనసియు వితయొ

౩ ఎదిలేని దిల్లాలి కిలువడియున్న ?
నెది కల దిల్లాలి కిలువడి లేక ?

౪ నిలుకడ యీలువు నెగడిన గృహిణి
గలిగిన మఱి పొందఁగల దెద్ది కలదు ?

౫ ఇతరద్దైవముఁగన కిలుఱేనిఁ గొలుచు
సతి యాజ్ఞయిడిన వర్షంబును కురియు

౬ తనధర్మమును గాచి దయితుని గాచి
మనువేలి విసుగదు మంచియిల్లాలు

౭ ఏమి కాపది చెఱసిడి కాపు సతులఁ ?
దా మిలువడిఁ గాచు తగవె యుత్తమము

౮ ఇట సతుల్ భర్త్రల నెలమి మన్నింప
నట సురల్ మన్నింతు రా సతీ మణుల

౯ పొగడిక వడు సతి పొనరక యున్న
పగఱ యెదుట సింహా వరగతి లేదు

౧౦ మడఁతికి శీలమే మంగళకరము
పడయ సుపుత్త్రుల వరభూష యదియు.

## ౭ సంతానము.

౧ తెలియఁదగిన వానిఁ దెలియు బిడ్డలను
గలుగుట గాకొందుఁ గాంచఁగా లేదు

౨ ఏడు పుట్టువులందు నెనయవు చెట్టి
లాడిక లేని గుణాఢ్యులఁ గన్న

౩ తనయులే యందురు తగుసొత్తు; వారు
జనియింత్రు కర్మాను సారులై తమకు

౪ చిన్ని చేతుల తోడఁ జిఱుతలు కలుపు
నన్నంబుకంటె నాయమృత మింపగునె ?

౫ చిఱుతల నివురఁగాఁ జెందు సైతనివి
చిఱుతల పలుకులు చెవి కింపు నింపు

౬ వీణియ క్రోవి యింపిత మనువారు
కూనల తొక్కు పల్కు విననివారు

౭ జనకుండు సుతులకు జరపు మే లదియ
తనయులఁ బండితోత్తములఁ జేయుటయ

౮ తమ కొమరులు పండిత శ్రేష్ఠు లగుట
తమకంటె నించును తమి యితరులకు

౯ తనయుని జనులు విత్తముఁడని యాడఁ
గనిన యప్పటికంటెఁ గన్నదుప్పొంగు

౧౦ ఎన్ని నోములు నోచె నితఁడను పలుకె
కన్నతండ్రికి బిడ్డ గావించు మేలు.

## ౮ మక్కువ కలిమి.

౧ పెరిమ కున్న దె మూసిపెట్టదు తలుపు
పొరి సదయుల యశ్రువులె దాని వెలుచు

౨ అదయుల పనులన్ని యగుచుండుఁ దమకె
సదయుల యెమ్ములుం జను నితరులకె

౩ అన్నువు లొడలితోడ నమరిన ఫలము
నసిఁ బ్రేమమయ వృత్తి జరవుటకొఱకె

౪ ప్రేమ హృద్బంధంబు వృద్ధి పొందించు
భూమి జనుల కది పొందించు మైత్రి

౫ ఇలఁ బెను భోగంబు నెనయు గృహస్థుఁ
డల ప్రేయమయ వృత్తి నలరిన ఫలము

౬ పాడికే ప్రేమ తోడ్పడు నను వ్వాడఁగు
తోడగుఁ జెడుగులఁ దోలఁప నయ్యదియు

౭ ఎమ్ములే నుసుఱుల నెండయుఁ బోలె
నెమ్మి లేనుసుఱుల నెఱి కాల్చి వైచు

౮ ఎలమి నుంతయు లేని యిలుజేని బ్రతుకు
తలిరుచు జెముడు చందమగు నెడారి

౯ ఒడలిలో మక్కువ యొందు లేకున్నఁ
గడమ యంగము లుండి కను ఫలమేమి ?

౧౦ ఎలమి కలవె జీవ మెనయు కాయములు
తోలుక గప్పిన యెంప తుకుక్క లన్యములు.

## ౯ అతిథి సత్కారము.

౧ ఉండి యేమి గృహస్థుఁ డౌగి మనుటెల్ల
నొండేమి? విందుల నుపచరించుటకె

౨ అతిథి వాకిట నిల్వ నమృతమేనింటి
యతఁడు తాఁ దినఁగోరు టర్హంబుగాదు

౩ వచ్చు విందుల నిచ్చవడిఁ గొల్చువాని
మెచ్చు జీవితము లేమిం గీడుపడదు

౪ తగు విందు నగుమోము తనర సేవించు
నుగుణు నింటను సిరి సొంపుగ నిలుచు

౫ అతిథుల సేవించి యవ్వలఁ గుడుచు
నతని పొలమున వేయఁగనేల విత్తు?

౬ ముందటి విందులఁ బూజించి వచ్చు
విందులఁ గనువాఁడు విబుధుల విందు

౭ అతిథి పూజాఫల మలవియే నుడువ
నతిథి యోగ్యతఁబట్టి యది యెసలారు

౮ అతిథులఁ బూజించి యలరని వారు
గతి చెడితిమ యండ్రు కై సొమ్ము చెడఁగ

౯ ఉండి లేవడి యది యోగ్యుల కిడమి
ఉండు నా మూఢత్వ మొగి నెడ్డెలకడ

౧౦ వాసన గొనునంత వాడును పొగడ
వేసరు విందు తాఁ బెడమోము సేయ.

## ౧౦ హితవాక్యములు

౧ కరుణామృదుత యవక్రతయు ధర్మంబు
నురవైన యదియె ప్రియోక్తి యటంద్రు

౨ లలి మొగంబునఁ బ్రియాలాపంబు లాడు
టెలమి నిచ్చుటకంటె నెక్కుడౌ నందురు

౩ నగుమోముతోఁ గాంచి నడచెంచి యెలమిఁ
దగు ప్రియ మాడుటే ధర్మమటందురు

౪ అందఱు నలరు ప్రియాలాపమాడఁ
జెంద దెద్దడి నగు చెట్ట లాతనికి

౫ మనుజున కతి ముఖ్య మండనంబు లగు
వినయంబును ప్రియోక్తి; పెరయవి కావు

౬ అరసి యర్థములు ప్రియాలాపమాడఁ
దఱుఁగుఁ బాపంబులు ధర్మంబు పెరుఁగు

౭ ఉపయుక్తమయి గుణయుతమగు వాక్య
మెపుడు నయము నిచ్చు నొసఁగించు మేలు

౮ కొడిమలు గనరాని గురుహిత వాక్కు
లిడుఁ గడు సంతోష మిరు పుట్టువులను

౯ హితవాక్కు లింపెనయించుట యెఱిఁగి
వితగఁ గరుసు పల్కు వితమేమి కోరి?

౧౦ హితవాక్కులుండ నహితము లాడుటలు
గలిసెడి పండుండఁ గాయఁ దినుటలు.

## ౧౧ మేలెఱుక.

౧ ఒదవని వానికి నొదవు మేలునకు
నొదవవు సాటి యీ యుర్వియు దివియు

౨ అదనెఱింగి యొనర్చి నట్టి యుపకృతి
అది యల్పమైన ఁవ్రేఁగగు భూమికంటె

౩ ఫలము కోరక చేయఁబడిన యామేలు
అలఁతి యయ్యు ఫలాన నబ్ధికిఁ బెద్ద

౪ నలుసంత మేలైన నగ తుల్యముగను
తలఁతురు మదిలోనఁ దత్ఫల విదులు

౫ మేలు కొలఁది గాదు మేలు మేల్గొన్న
శీలి యోగ్యతఁబట్టి చెన్నొందుచుండు

౬ మఱవరాదు విమల మానసునీతి
తొఱఁగరాదు దొసంగు దోర్చిన మైత్రి

౭ మూఁడిన యిడుములఁ బోకార్చు చెలిమి
నేడేడు భవముల నెన్నుచుందురు

౮ మంచిని మఱచుట మంచిది కాదు
మంచి కానిది నాఁడె మఱచుట మంచి

౯ కొలవంటి చెడుగు నొక్కఁడు చేయ నతని
తొలిచేయు మేలెన్నఁ దొలఁగు నాకీడు

౧౦ చెఱచిన మేలు పాచిలి యుండుఁగాని
మఱచినవానికి మఱి లేదు భువిని.

## ౧౨ నడియున్కి.

౧ ఒడికాన నొక వంక కొఱగక మెలఁగు
నడియున్కి యొక్కటే నలువైన తగవు

౨ నడియున్కివాని ధనంబెల్ల చెడక
బడిబడి తరువాతి వారల కొదవు

3 నలువొసంగినయేని నడియున్కి తొలఁగఁ
గలుగు సంపదఁ ద్రోవఁగాఁదగు నాఁడె

౪ ఏరు యోగ్యు లయోగ్యు లెవరన నేల?
వారి పిదప నిల్చువానిచేఁ దెలియు

౫ చెడుగు మేల్లగు నొనర్చిన కర్మగతుల
నడియున్కి యెడ నుంట నగ ధీవరులకు

౬ నడియున్కి యెడ వీడి నడచు తలంపె
చెడు సూచనంబని చెప్పంగఁదగును

౭ తగులమి తగవుగాఁ దగువాని తగ్గు
జగము పేదఱిమిగాఁ జలుపదు తలఁపు

౮ తగ్గెచ్చు సరిచూపు దండియు పోల్కి
తగ్గెచ్చు లేమి పెద్దలకగుఁ దొడవు

౯ పలుకులలోఁ బక్షపాతంబు మదిని
నలుసంత లేకుంట నడియున్కి యగును

౧౦ పరుసొమ్ము తనసొమ్ము వంటిదే యనుచు
జరుపు వాణిజ్యమే చను మేటి యగుచు.

## ౧౩ అడఁకువ కలిమి.

౧ అడఁకువ వేల్పులం దమరుచు నొకని
నడఁగమి యిడును తన్నంధాతమమున

౨ అడఁకువకంటె గొప్పది లేదు గాన
నడఁపు నొడమిపోలె నరయంగఁదగును

౩ విజ్ఞానమార్గాన వినయంబు నొంద
విజ్ఞు లెఱుంగుచో వెలయు గౌరవము

౪ తగవున నిల్చునాతని వినయంబు
పొగడొందు మేరువు పొడువును మించి

౫ వినయ మెల్లరకును వెలయు నౌ నందు
ధనికుల కదిమేటి ధనముగా మెఱయు

౬ ఒక మేన ధులివలె నొప్పియై దడఁప
నొకయేడు జన్మాల నొగిఁ దన్నుగాచు

౭ వేని పీడిన నాల్క విడక కావఁదగు
నానాల్కసడలిన నడరు దుఃఖములు

౮ మనను నొప్పించెడి మాట యొండేని
వినుట కింపుగ నున్న వెడలించు మేలు

౯ కాలుచు పుండాఱుఁ గాని తా నెదను
నాలుకతోఁగాల్పు నవయ దా గుఱుతు

౧౦ అలుక యడఁచి నేర్చి యడఁగు వలంతి
వలనిని ధర్మదేవత ప్రతీక్షించు.

## ౧౪ నడవడి కలిమి.

౧ నడవడి గొప్పతనము నిచ్చు కతనఁ
గడఁక నుసుఱుకంటెఁ గావఁగఁబడెడి

౨ అలసియుఁ గాపాడ నగు నడవడిని
తెలిసి కాచి యరయ స్థిర నదే తోడు

౩ మంచినడత చుమ్ము మనుగడ మేల్మి
క్రించుఁదనము సుమ్ము కీడగు నడత

౪ పాఱుండు మఱచినఁ బడయునా శ్రుతుల
జాఱిన నడవడి చనును దుర్గతికి

౫ కడుపూఁద గలవాని కడఁ గల్మి లేదు
నడవడి హీను నండను పేర్మిలేదు

౬ నడవడి చెడిన నొనరు చేటు లరసి
విడువరు దానిని విజ్ఞాన యుతులు

౭ నడవడి యున్నచో నలువు నొందుదురు
చెడినఁ నొందఁగరాని చేటు లొందుదురు

౮ కడు మంచి నడత మేల్గలుగఁ గారణము
చెడు నడవడి కీడు చెందఁ గారణము

౯ ఒప్పిన నడవడి యున్న వారలకుఁ
దప్పితాఱియు నోటఁ దరలదు చెడుగు

౧౦ జగమునొంటి చనంగఁజాలని వారు
మొగిఁ బెక్కు నేర్చియు మూఢులే వారు.

## ౧౫ పరసతీ విరాగము.

౧ పరనారి నాసించి వఱలెడు జడిమ
నెఱిధార్మికులకడ న్వెదకిన లేదు

౨ నెఱిదప్పి చరియించు నింద్యులయందు
పరనారిఁ గోరెడు వాఁడధముండు

౩ తను నమ్మి చనువాని దారను కవయు
మనుగడ కలవాని మను పీనుఁగండ్రు

౪ పట్టి పరస్త్రీని పఱచు నాతనికి
నెట్టి సాయములున్న నేమి ? నిష్ఫలము

౫ సులభంబనుచుఁ బరసుదతిని జెఱుపఁ
బోలివోని నిందలు పొలసి కీడ్పఱచు

౬ పరదార నెనసినఁ బగయుఁ బాపంబు
శిరము వ్రాలుడు నింద చేరి తన్నలము

౭ ఒరునాలి చెలితన మొల్లనియతఁడె
నెఱి తప్ప కిలుమన్కి నెఱపెడు నతఁడు

౮ ఒరునాలి నొల్లని యురు పౌరుషంబు
నెఱియు కాదది యొక నెఱవైన నడత

౯ ఒగిఁ బరాంగన మూఁపు లొరయని వారె
తగు నిమ్మగుదు రెల్ల ధర్మంబులకును

౧౦ ఇతర ధర్మంబుల నెట్లు వీడినను
మఱిఁ బరస్త్రీ వాంఛ మానుట లెస్స.

## ౧౬. ఓరుపుఁ గలిమి.

౧ తనుగ్రొచ్చు వారిని ధర యోర్చులీల
తను కీడ్పఱుప నోర్చు తాల్మి మేల్ తగవు

౨ నిందల నోర్చుట నెఱవైన లెస్స
నిందల మఱచుట నెఱి యంతకంటె

౩ లీల విందోమమి లేమిలో లేమి
బాలిశుఁ దాళుట బలిమిలో బలిమి

౪ మేలిమి చెడనీక మెలఁగఁ గోరునెడఁ
దాలిమి చెడనీక తాఁ గావఁదగును

౫ ఒగి లెక్కిడరు ప్రాజ్ఞు లోర్వనివారిఁ
బొగడుదు రోర్పరిఁ బొన్వోలెఁ దడవి

౬ ఓర్వక యడరిన నొకనాఁటి కింపు
ఓర్వ వినుతి లోకమున్నంత దనుక

౭ తగవేది యొరులు బాధ యొనర్ప నొచ్చి
తగు ప్రతిక్రియ సేయఁ దలపమి లెస్స

౮ పొగరుచేఁ జెడుగోరుల్ పొనరుతు రేని
తగ నోర్పు బలిమిమైఁ దగును జయింప

౯ కుజనుల చెడు పలుకుల నోర్చువారు
నిజము యతులకంటె నెఱి మేలువారు

౧౦ తినక యోర్చెదు ముని ధీరులకంటె
తిని యోర్చువారలే స్థిర గొప్పవారు.

## ౧౭ ఊఁడ లేమి.

౧ తన యెడఁద నసూయ తనరని తీరు
తన నడవడిగాఁగఁ దగు నలవఱుప.

౨ ఎవరి యెడను నేని యెరుసూడ్పుకంటె
మివిలిన త్యాగంబు మేదిని లేదు

౩ ఒరుల సంపదఁగాంచి యోర్వలేనతఁడు
పరమ ధర్మశ్రీని వలదనువాఁడు

౪ ఎగ్గువలని కీడు లెఱిఁగి వివేకు
లెగ్గొనర్పరు మది నీరసమూని

౫ ఎరుసు లోనున్న నదే చాలుఁ బగఱు
మఱచినఁ జెడిన నేమఱ కిచ్చుఁ జెడుగు

౬ పరుల యోగి కసూయపడి క్రుళ్లువాఁడు
తెరలు స్వజనులతోఁ దినఁ గట్ట లేక

౭ పరుల కల్మి కసూయ పడువాని యిల్లు
సిరియొల్ల కక్కకుఁ జే సూపి విడుచు

౮ కడుపూఁద యనుపాపి కడఁక భాగ్యంబు
నెడలించి నిరయంబు నెనయఁగాఁ ద్రోచు

౯ అనఘుని లేమి యీర్ష్యాళువు కలిమి
ఘన లోక చిత్రంబుగా నెన్నఁబడును

౧౦ లేరీసుచే వర్ధిలిన వారు ముందు
లేరది లేమిఁ బొలియు వార లెందు.

18

## ౧౮ నాఁచికొనమి.

౧. నడియున్కి విడి సద్ధనము నాఁచికొన్న
చెడుఁ గుటుంబము మఱి చెడుగులు గలుగు

౨ నడియున్కి చెడుటకు నడఁకెడువారు
కడుపుఁగూటికిఁ గడంగరు నింద్యములకు

౩ చిఱు సుక మాసించి చేయరు కొడిమ
తఱుఁగని సుకము పొందఁగఁ గోరువారు

౪ విజితేంద్రియులు సత్య విమల మానసులు
ఇఱుకైనఁ బరుల సొత్తిచ్ఛింప రెపుడు

౫ కలఁగి దురాశచేఁ గానివి సేయ
నలసి పడయు తెల్వి నగు ఫలం బేది?

౬ సదయుఁడైనను పర సంపదఁ గోరి
యెదఁ గీడు దలఁచిన నెయిదు నాశంబు

౭ ఒరుసొత్తు నాఁచి తానొందిన యొడమి
పొరయించుఁ జెడుగుఁ గావునఁ గోరఁదగదు

౮ పరుచేతి ధనము నపహరింపకుంట
తఱుగులేమి యగును తన ధనంబునకు

౯ ఎఱిఁగి ధర్మము ప్రాజ్ఞ లేఁకర రెండు
ఎఱిఁగి వారిగుణంబు లెనయును ల[illegible]

౧౦ ఆరయ కాసింప నగు వినాశమ్ము
కోరమి యొసఁగును గొప్ప గారమ్ము.

## ౧౯ వెనుక నిందింపమి.

౧ పాటిసేయక చెడుపని మాను కంటె
మాటున నిందలు మానుట లెస్స

౨ పాటఁ దిట్టి కోడిమె పచరించుకంటె
మాటునఁదిట్టుచు మఱి నవ్వ చెడుగు

౩ మఱుఁగున నిందించి మనుకంటెఁ జావ
ధరనబ్బు వానికి ధర్మఫలమ్ము

౪ దయలేక యెదుట నిందలు సేయుకంటె
నయమాడి యెదుట వెన్కాల నింద చెడుగు

౫ విరివిగాఁ దగవు చెప్పెడివాని మనసు
మఱుఁగున నను కీడు మాటలఁ దెలియు

౬ పరుల దోసము లెత్తిపాడెదు నెడలఁ
బరులచేఁ దనగుట్టు పలుకంగఁబడదె?

౭ పగవల్కి వినఁగ వేర్పఱచెడువారు
నగఁబల్కి హితము గొనఁగలేనివారు

౮ హితుల దోసములె తూర్పెత్తెడువార
లితరుల పట్ల నింకెట్లుందు రొక్కొ?

౯ వెనుక నిందించు నవ్వాఁడగు మైబరువు
తన విధియని భూమి తగమోయునేమొ?

౧౦ పెఱల దోసముపోల్కి స్వీయదోషముల
నెఱిఁగి మనెడు జీవి కెడరెందు గలదు?.

## ౨౦ పల్లఱపులాడమి.

౧ పెక్కురు వినుగఁగాఁ బ్రేలెడు వాని
వెక్కురు గాఁగ భావింతు రెల్లరును

౨ చెలువుర కహితంబు సేయుటకంటెఁ
బలువురకడ నోరు వాగుట కీడు

3 పలువురకడఁ జాల వదరుచునుంట
తెలుపుఁ దన్నదియె నీతి విహీనుఁగాఁగ

౪ పలువుర యెదుటను వదరువానియెడ
నిలువదు విఖ్యాతి నెగడదు నీతి

౫ ఒప్పైన నడవడి యున్నను ప్రేలు
డొప్పిన నిలువదు యోగ్యత యవల

౬ నరుఁడని వదర నెన్నఁగరాదు వాని
నరులలోఁబొల్లుగా నలి నెన్నఁదగును

౭ పలికినఁ గటువులు పలుకుఁడు బుధులు
ఫలహీన వాక్కులఁ బలుకమి లెస్స

౮ అరుదైన ఫలముల నరయు విజ్ఞాను
లురు ఫల హీనోక్తు లొల్లరు నుడువ

౯ మఱపూడ్చి మది మసి మాడ్చినవారు
మఱచియు వితయగు మాటల ననరు

౧౦ పలుకుఁడు పలుకున ఫలమిచ్చు పలుకు
వెలలనీకుఁడు నోట విఫలమౌ పలుకు.

## ౨౧ పాపభీతి.

౧ చెడు పనులకు సాహసింతు రధములు
చెడుగులొనర్ప లజ్జింతు రుత్తములు

౨ చెడుగులు చెడుపంట చేకూర్చుకతనఁ
జెడుగన్న బెడిదమౌ సెగ తేనికంటె

3 చెడుగులొనర్చిన చెడుగరికేని
చెడుగొనర్పక యుంట శ్రేష్ఠమౌ తెలివి

౪ ఎంచకు మఱచియే నితరున కెడరు
నెంచినఁ దత్ఫల మిచ్చు ధర్మంబె

౫ లేదని చెడుపనుల్ సేయంగఁదగదు
పేదగా నదియు కావించును మఱియు

౬ తనకు నే నొవ్వి రాఁ దగదనువాఁడు
ఒనరింపఁగాఁదగ దొరులకుఁ గీడు

౭ పడయవచ్చు బ్రదుకు పగ యెట్టిదైనఁ
జెడఁగోరు పగ తన్నె చెఱచు వెన్నంటి

౮ తన నీడ యడుగంటి తగ వీడనట్లు
తనచెట్ట వీడక తన్నె బాధించు

౯ తన మేల్మి కోరినతఁడు పెరవారి
కొనరింపఁ దగ దెట్టి యొప్పమియైన

౧౦ చెడు ద్రోవలం దేగి చేయఁడేఁ జెడుగు
చెడని వాఁడతఁడని చెప్పంగఁదగును.

## ౨౨ ఉ ప కా ర ము.

౧ మఱుమేలు కోరవు మాన్యుల విధులు
మఱుమేలు చేయునే ? మహి మేఘమునకు

౨ తగుయత్నమున నబ్బు ధన సముదయము
తగువారి కొదవంగఁ దగినది యగును

3 ఉపకృతితోడ దీటొందు కార్యంబు
నుపమింపఁ గానరా దుభయ లోకముల

౪ జగమొప్పు విధిఁ గని జరగెడువాఁడె
యగుజీవి; పెరయతఁ డగు నడ పీన్గు

౫ ఊరి కొలని నీర ముపయోగ విధము
పే రెఱుక నడచు పెద్దల ధనము

౬ ఫలవృక్ష మూరిలోఁ బండిన యట్లు
కలిమి నీతి గలాని కడ నెక్కుడుంట

౭ పెను తగవరికడఁ బెనుపొందు కలిమి
అనువుగ మేలి మందగు చెట్టు కరణి

౮ పేద లేదైయెనను విహితజ్ఞు లెలమిఁ
బేదల కొదవంగ వెనుదీయ రెపుడు

౯ పరుల కుపకరింప వలనఱు చింత
విరివార నుపకారి పేదతనంబు

౧౦ ఎన్నఁగా మేలుచే నెడ రబ్బునేని
తన్నమ్ముకొనియైన దాఁ గొనఁదగును.

## ౨౩ ఈవి.

౧ బీదల కిడుటొండె వితరణమగును
మీఁదివి మఱుమేలు మొయికొను గుఱివి

౨ తగుపద్ధతియొ యన్నఁ దగ దీగి కొంట
సుగతి లేదన్న నిచ్చుట కడుమేలు

౩ తనకు లేదనెడి చింతను తెలుపకయె
తనకున్న దిచ్చుట తగుఁ గులీనునకు

౪ యాచకుమోము దైన్యమువోవు దనుక
యాచింపఁబడుట యోగ్యతగాదు పతికి

౫ తపముచే గోదనోర్చు తాళికకంటె
తపియించు గోదతీర్చు తాళిక గొప్ప

౬ గోదఁ గ్రుంగువారికిఁ గుడువంగ నిడుట
పదిలించి డబ్బుంచు బదరిక మగును

౭ పంచి కుడువ నలవాటైన వానిఁ
గ్రుంచి నొప్పింపదు గోదయును తేవులు

౮ కలిమిఁగూరిచి కాచి కాంచు కఠినులు
తెలియ రేమొకొ పెట్టి తేలు సౌఖ్యములు ?

౯ ఒడమి దండిగఁ గూర్చ యోచించి యొంటిఁ
గుడుచుట యాచనకును కీడు సుమ్ము

౧౦ చావుకంటెను లేదు జగతి నించనిది
చావె యుంపగు నీగి సాగని చోట.

## ౨౪ కీర్తి.

౧ ఒసఁగుఁ డొసఁగి కీర్తి యొందుఁడు జనికిఁ
బొసఁగు యశము కంటెఁ బొలుపేది కలదు?

౨ నుడువువారు నుడువు నుడువుల సార
మడిగిన నీగిచే నగు కీర్తి యొండె

౩ వరకీర్తి యొక్కటే వసుధలో స్థిరము
పెరయవి చెడక యెప్పుడునవి లేవు

౪ ప్రబల కీర్తినిగొన్న ప్రాజ్ఞులు గలుగ
విబుధులకె స్వర్గంబు వినుతింపఁబోదు

౫ పరువుఁబెనుచు కీడు, వరకీర్తి నిల్పు
మరణంబు, నరిది సామాన్యులకిలను

౬ తోఁచినఁ గీర్తితోఁ దోఁచుట మేలు
తోఁచుకంటె నకీర్తిఁ దోఁపమి మేలు

౭ పొగడు వడక మని పొగడక తమ్ము
తెగడఁ దెగడుకోక తెగడుట యేల?

౮ తమకుఁ బిమ్మట నిల్పు తలఁగని కీర్తిఁ
దమకానఁ బడయమి తమకొప్పదండ్రు

౯ పొగడులేని యొడలి మోచిన నేల
అగడులేని ఫలంబు నందక క్రుంగు

౧౦ మనువారె మనువారు మాట దూర్వడక
మనియు మననివారె మహిఁ గీర్తి లేక.

# నివృత్తి మార్గము.

## ౨౫. దయాళుత్వము. ... 16 &

౧ నెనరు కల్మియె కల్మి నెఱ కల్మలందు
ధనము కలిమి నీచు దండను గలదు

౨ నెనరు నేలికొనుఁడు నెఱి త్రోవ నరసి
ఒనరు తోడదె శ్రుతు లారసి చూచినను

3 కరుణామయాత్ములు కనుటయే లేదు
నెఱయు తమము గల నిరయంబు చొరవ

౪ మనుజీవులను జాలి మనుచు పుణ్యులకు
నొనరదు ప్రాణమ్ము నుడికించు కీడు

౫ కరుణాత్ములకు లేవు కడగండ్లు; గాలి
నెఱసిన యీపెను నేలయే సాక్షి

౬ నెనరేది చెడుదారి నెగడెదు వారు
మను తగ వొనరింప మఱచిన వారు

౭ లేదీ జగము కల్మి లేని వారలకు
లేదా జగము దయ లేని వారలకు

౮ ధనము నీఁగినను పొందఁగవచ్చు మరల
నెనరు నీఁగిన మఱి నెలకొను టరిది

౯ కరుణ హీనుఁడు ధర్మకర్మముల్ సేఁత
ఎఱుకలేవడి దేవు నెఱుఁగుటఁబోలు

౧౦ బలహీనుఁ దలపడు పట్టునఁ దన్ను
బలయుతుఁ డెదిరించు పట్టించఁ దగును

## ౨౬. మాంస నిషేధము.

౧ తనపొలఁ బెంప నితర మాంసములను
తినువాఁడు కరుణ నేతీరునఁ దాల్చు ?

౨ ధనము ఫలము లేదు తగఁ గావకున్న
నెనరు ఫలము లేదు నెఱ పొలదిన్న

౩ ఎఱచి చవులుగొన్న యెదలోనఁ గరుణ
నెఱయదు కైదు వ్రాసిన మదిఁ బోలె

౪ చంపమి దయయండ్రు చంపుట హింస
చంపి మాంసము దినఁ జనుట పాపంబు

౫ పొలఁ దినమియె ప్రాణి ప్రోవు నిజమ్ము
పొలఁ దిన నరకానఁ బూఁడుదు రెపుడు

౬ తిను కారణమున వధింపరయేని
కొవ నంజు డొసఁగువా గ్గొఱలరు జగతి

౭ పొలయున్న నొకమేని పుండగు దానిఁ
దెలిసిన ప్రాజ్ఞులు తినఁగూడ దెపుడు

౮ దొసఁగుల నీఁగిన దొడ్డ విజ్ఞాను
లుసులు నీఁగిన పొల నొప్పరు తినఁగ

౯ పొరివేయి హవ్యముల్ మొగి వేల్చుకంటె
హరియించి యొకయును ఱానమి మేలు

౧౦ ఎఱచిఁ దివక కొల మొఱుఁగక యున్న
నెఱఁగి గేల్మోడ్చు నెల్ల జీవులును.

## ౨౭ తపము.

౧ కలుగు నోవుల నోర్వ్ప కలిమి, యహింస,
యలరు తపంబు రూపందురు బుధులు

౨ తనతొలి సుకృతానఁ దప మిప్పుడబ్బుఁ
గనఁడు సత్కృతి లేక ఘన తపః ఫలము

౩ తపసులఁ గాపాడు తమి గల్గుకతనఁ
దపియింప మఱచిరో! తదితరు లిలను

౪ అహితుల సుహితుల హరియించు కాచు
మహిమ మబ్బుఁ దలంచు మాత్రఁ దపమున

౫ కోరినవెల్లఁ జేకురుటచేఁ దపము
కోరి యిమ్మేనఁ దాఁ గూర్పంగఁ దగును

౬ తమవిధుల్ నెఱవేర్త్రు తపమునవారు
తమికి లోనై పెరల్ తవులుదు రడరు

౭ కాఁచఁ గాఁచఁగఁ బొన్ను కళమాడ్కిఁ గష్ట
మేఁచ నేఁచఁగఁ దేజ మెచ్చు మునులకు

౮ తన జీవితము తాను తగినట్లు నడపు
జనుని లోకము మెచ్చి చాల నుతించు

౯ తఃబమున సంసిద్ధి తనరినవారు
ప్రబలులై జమునైనఁ బాఱఁదోలుదురు

౧౦ పుడమి దరిద్రులు పొదలఁ గారణము
కడఁకఁ దపస్సులు కడుఁ దక్కు వౌట.

## ౨౭. అనర్థ వర్తనము.

౧ వంచకుని కపట వర్తన మరసి
పంచభూతములు లోపలనె హసించు

౨ తనయెఱింగిన తప్పు తనమది సేయఁ
బనియేమి మిన్నంత పై వేడబంబు

౩ బలయుతు వేసంబు బడు గూను లెన్నఁ
బులితోలు గొని యావు పొలము మేయుటలు

౪ వేఁటరి పొద డాఁగి పిట్టలఁ బట్టు
వాటమా లింగి తా వంచించు టొరుల

౫ పట్టు పీడితిమని పలికెడు లింగి
ఎట్టెట్టులను కీడు లెనయుంగఁ గలఁదు

౬ మనసున సన్న్యసింపక వేసమూని
చను మాయికంటె నీర్ష్యగలాఁడు లేఁడు

౭ గురిగింజ యెఱుపుఁబోల్ కోలంబు ముక్కు
కఱవోలు మదివారు గలరు జగమున

౮ కఱ మదిలో నుండఁగాఁ దానమాడి
మఱుఁగువెట్టి చరించు మనుజులు హెచ్చు

౯ అలుఁగు పీఁణియ రూపు లవిసేయు పనుల
వలె నెఱుఁగందగుఁ జనులచే గుణము

౧౦ జగము నిందించు చేష్టలు పీడు నెడల
తెగ గొఱుగఁగనేల? తిరి వెంచనేల?

## ౨౯. దొంగిలింపమి.

౧ మదిఁదెగడమిఁ గోరు మాన్యుండు భూమి
నెదియు దొంగిలనీక యెదఁ గావవలయు

౨ తలఁచుటయుం దప్పు తగని కర్జములఁ
దలఁపున ముచ్చిమి తప్పుగాకున్న ?

౩ ముచ్చిలు ధనము మున్నుండు హెచ్చిల్లు
నచ్చునఁ దోఁచి పాడఱు మేరమీఱి

౪ ముచ్చిలు నాసక్తి మొదట నింపైన
విచ్చని దుఃఖముల్ వెనుక నొసంగు

౫ ధనముకై యేమఱు తరుణంబుఁ జూచు
జనులు దయనెఱింగి జాలి నొందుదురె ?

౬ చోరత్వమున మహోత్సుకత గలారు
వారకెల్లను నిల్చి వర్తింప లేరు

౭ మర్యాద యెఱిఁగిన మాన్యులయెడలఁ
జౌర్యమను చీఁకటి చర్చింప లేదు

౮ మర్యాద గలవారి మది ధర్మమట్లు
చౌర్యయుక్తులకు వంచన ముంచు నెదను

౯ చౌర్యంబు దక్కొండు చవి చూడకున్న
మర్యాద మీఱఁగా మాలుదు గంటె

౧౦ దొంగలఁ దమమేను ద్రోఁచు నొల్లకయు
దొంగిలింపని వారిఁ ద్రోవదు దివము.

## ౩౦ సత్యము.

౧ ఏది సత్యంబన నెల్ల ప్రాణులకు
నే దొనఁ గెసఁగింప కింపగు వాక్కు

౨ చెడుగులఁ దొలఁచి మేల్ చేకూర్చుపొల్లు
నుడియు సత్యమని విజ్ఞులు వచియింత్రు

౩ తనమది కెఱుకయై తగబొంకరాదు
తనమదియే కాల్చుఁ దన్ను బొంకినను

౪ మనసార బొంకక మనువాఁడు జనుల
మనసున వసియించు మాన్యతఁ జెంది

౫ నెపమిడ కెదతోడ నిజమాడు నేని
తపసికి దాతకుఁ దా మేలువాఁడు

౬ నమకీర్తి లేదిల సత్యంబుతోడ
శ్రమయీయ కదె కూర్చు సర్వధర్మముల

౭ నిక్కంబు నిక్కమై నెఱి నిల్చునేని
తక్కినయవి చేయఁదక్కిన నేమి?

౮ ఒడలి తేట వెలయు నొగి నీటిచేత
నెడఁద తేట దెలియు నిల సత్యమునను

౯ అన్ని దివ్వెలు దివ్వెలగు నేమి? బుధుల
కెన్నఁగా నిజమనియెడి దివ్వె దివ్వె

౧౦ నిజముగ మేము గాంచినవాన లేదు
నిజమునకెచ్చు; దానికిఁ దక్కు దక్కు.

## ౩౧ కోపము లేమి.

౧ చెల్లుచోఁ గినుక నాఁచిన యదె యాఁపు
చెల్లనిచోటఁ గాచినఁ గావ కేమి?

౨ చెల్లనిచోఁ గినుక చెడుగిచ్చుఁ బూనఁ
జెల్లుచోఁ బెరలేదు చెడు గంతకంటె

౩ ఊనఁదగదు కోప మొక ప్రాణియెడను
ఊనినఁ జెడుగులే యొందును గాన

౪ నగవును ముదమును నాశంబు సేయుఁ
బగటు కోపముకంటెఁ బగయొండు కలదె?

౫ కీడు కోరఁడ యేని కినుకఁ గావఁదగు
పీడిన నదె తన్ను పీడించి చంపు

౬ తన సురాశము మున్ను తన్ను దహించి
తన వార లను హేమ తరణి దహించు

౭ అలుకసే గుణముగా నార్జించు ఫలము
నిలఁ జేత నడువ నయ్యేడి ఫలంబంద్రు

౮ జ్వలితాగ్నిఁ బోల్ చెట్ట నలిపిన యతఁడె
యొలసిరాఁ గినియక యోర్చుట లెస్స

౯ ఉల్లంబులోఁ గినుక యుంచఁడ యేని
యెల్ల యభీష్టంబు లీడేఱుఁ దనకు

౧౦ పడినారు పడినారె పాపంపు టలుక
విడినారు విడినారె వేడ్కమైఁ గినుక.

## ౩౨ అనిష్టము చేయమి

౧ ఘనగౌరవముఁ గూర్చు కలిమి యొప్పినను
వనట యొరుల కీమి పావన నియతి.

౨ పగగొని యొకరుఁ డొప్పమి యొనర్చినను
పగ మాఱు చేయమి ప్రాజ్ఞుల గుణము

౩ ఊర కొక్కఁడు తన కొప్పమి సేయ
మాఱొనర్చిన వచ్చు మరలని కీడు

౪ కీడు చేసినను సిగ్గిల మేలు చేసి
పీడుటే దండించు విధి యుత్తములకు

౫ పరునొవ్వి తనదిగా భావించి రక్ష
జరుపఁడేని కలదె జ్ఞానంబు ఫలము?

౬ చెడు గని తనకుఁ దోఁచిన దాని నొరుల
కడఁ బూనకుండుటే ఘనమగు పాడి

౭ ఏనాఁడు నెవరికే నంత కీడైనఁ
బూనమి మనసున బుధులకు లెస్స

౮ తనకు దుఃఖదములఁ దానెఱింగియును
మనుజీవి నొంచుట మది నేమి కోరి?

౯ ఒరుల కెగ్గొనరింప నొక ఱేపువేళ
మరలును తనయంత మఱు మాపువేళ

౧౦ చెడుగులెల్లను వచ్చుఁ జెడుగు చేసినని
చెడుగులొల్లని వారు చేయరు చెడుగు.

## 33 చంపమి.

౧ అన్ని ధర్మముల కార్యంబు చంపమియు
అన్ని పాపముల కార్యంబు చంపుటయు

౨ పంచి కుడిచి పెక్కు ప్రాణులఁ గాపు
నంచితులంద్రు మేలగు ధర్మ మనుచు

3 ఎనలేని దొకటె యహింస, తక్కినవి
వెనుకవి, వానిలోఁ బెద్ద బొంకమియు

౪ ఏది సన్మార్గమో నెద్దానినేని
బాదింప కరుగంగ భావించు త్రోవ

౫ జననస్థితికి జంకు సన్న్యాసికంటె
మనుజీవిఁ జంపక మనువాఁడు మేటి

౬ చంపమి మదిగల జనుని ప్రాణంబు
నొంప యముఁడుఁ బన్నుగఁ బోవలేఁడు

౭ తనప్రాణములు పోవు తఱినైన నితర
జని తీపి ప్రాణంబు సమయింపఁదగదు

౮ భోగ భాగ్యంబు లిమ్ముల వృద్ధియైన
బాగు కాదంద్రు చంపఁగ నగు సుఖము

౯ సతత హింసకులు కసాయి వారలుగఁ
దత దయాపరుల కొందఁగఁ దోఁచువారు

౧౦ ఒడలి నొవ్వులదోఁత యున్నారు తొల్లి
మొదలినుండి యుసురులు లూడ్చినవారె.

# జ్ఞానము.

## ౩౪ అస్థిరత్వము.

౧ నిలువని వానిని నిత్య మంచెంచు
నలుపపు మతులౌట యరయంగఁ గీడు

౨ ఆటకు జనుల తోయమున ధనమ్ము
పాటిగా వచ్చుట నడిఁ బోవు టగును

౩ కలిమి చాంచల్యంబు కలది యున్నపుడె
సలుపంగాఁదగు నిత్య సర్వధర్మముల

౪ దినపరిమితిఁ జూపి త్రెంచు అంపంబు
మొనఁబోలుఁ గాలంబు ప్రోడల కరయ

౫ రసన నడఁచి వెక్కురాక యామున్నె
వెసఁ దన విధులఁ గావింపఁగాఁ దగును

౬ నిన్నఁగలుగువాఁడు నేఁడు లేఁడనుచు
నెన్నఁగాఁ గలయది యీలోక మహిమ

౭ ఒక క్షణమే నుందుమో లేమొ కనని
వెకలుల తలఁపులు వేలును కోట్లు

౮ పోతంబు గ్రుడ్డొంటు పోవఁగా వదలు
రీతియాఁ దోడుసు శరీరాసువులకు

౯ మడియుట నిద్రించు మాడికి నొప్పు
పొడముట మేల్కను పోలికి నొప్పు

౧౦ తెగుళుల కిమ్మగు దేహాన నొదిఁగి
తగులు జీవములకుఁ దగు నిమ్మ లేదో ?

## 3౫ పరిత్యాగము.

౧ వేనివేని తగులు వీడుచునుండు
వాని వాని వలన వనరుట లేదు

౨ వదలి సంతసించి కల్గు ఫలమెచ్చు గాన
వదలంగఁదగుఁ దగు వయసున యుండె

౩ అడఁపఁగఁదగును శబ్దాదుల నడఁచి
పడసినవానిఁ దప్పక వీడఁదగును

౪ ఒండేని తపసుల కుండమి తగవు
ఉండినఁ దమమున నురల హేతువగు

౫ పొడుపు దుఃఖము సేఁగఁ బూనువారలకు
నొడలె యెక్కువ; పెరలుండు టేలొకో?

౬ నేను నాదను నొంటు సేఁగినయతఁడు
తానొందు నిర్జరతతికిఁ బైకత్త్య

౭ నేను నాదను నొంటు సేఁగనివారి
మానక యంటు జన్మంపు దుఃఖములు

౮ మొదలంట విడువారె ముక్తులౌ వారు
వదలని వారిల వలఁబడువారె

౯ తొడుసు వీడినపుడె త్రుంగుఁ బుట్టువును
విడకున్నఁ బుట్టువుల్ వీడకయుండు

౧౦ పట్టులేని యతని పట్టు పట్టఁదగు
పట్టిన యప్పట్టు పట్టు వీడుటకు.

## 3౬ తత్త్వవివేకము

౧ స్థిరమని యస్థిర స్థితిని భావించు
నరయమిచేఁ గల్గు నల్ప జన్మంబు

౨ అరయమి తొలఁగిన యమలుల కెన్నఁ
దొఱఁగును పుట్టుకల్ తోఁతెంచు ముక్తి

3 సందియంబులు నీఁగు జ్ఞానుల కెపుడు
నందుబడి యగు నిహాముకంబెఁ బరము

౪ అంచిత జ్ఞానంబు నందని వారి
పంచేంద్రియ జ్ఞానఫలము నిష్ఫలము

౫ ఏవస్తువందున నేఁగుణమున్న
నావస్తువున నిత్య మరయుటే తెలివి

౬ ఎఱిఁగి యీజన్మమందే నిత్యతత్త్వ
మరసిన మఱుపుట్టు వందఁగాఁబోరు

౭ ఉల్లంబు నిలిపి లోనున్నది తెలియఁ
దెల్లంబు మఱుబాము తెలియఁడాతండు

౮ జనన దారిద్ర్యంబు చన నిత్యవస్తు
వను ధనంబును కాంచునదియె మేల్ తెలివి

౯ మూల మరసి బంధ మూలంబుఁ ద్రెంప
మ్రాలు దుఃఖములు ప్రామఁగ నున్నయవియు

౧౦ అనుగంటఁ గామక్రోపావిద్య లవియు
నడఁగాఱుఁ బేసులే కడరు దుఃఖములు.

## ౩౭. రాగత్యాగము.

౧ అన్ని జీవములకు నన్ని కాలముల
నెన్న నాసయె బాము లిచ్చెడి విత్తు

౨ కోరినఁ బుట్టుమి కోరంగవలయుఁ
గోరమిఁ గోరినఁ గొనసాగు నదియు

౩ కోరమి వంటి దీ కువలయమందు
నారయ స్వర్గంబు నందును లేదు

౪ ఎది శుద్ధియన నాస యెదలేకయుంట
అది సత్య వాక్కుచే నమరు నెల్లరకు

౫ త్రెంచినారన నాసఁ ద్రెంచినవారె
త్రెంచని వారాసఁ ద్రెంచనివారె

౬ ఆసయే వంచించునది యొక్కరువుని
ఆసకు నడలుటే యగును ధర్మంబు

౭ కోరికల్ మొదలంటఁ గోసిన ముక్తి
కోరకయే వచ్చి కుదురుఁ దనంత

౮ ఆసలేదే నొక యడరును లేదు
ఆసింపఁ బయిపయి నగు నంతులేక

౯ ఆస యణఁ పెనుచింత యణిన నిమ్మేన
నాసిరిల్లని సుఖానందంబు గలుగు

౧౦ నిండనిదగు నాస నీఁగిన యంత
నిండుగుణంబు నా నియతియు నిచ్చుఁ.

## ౩౮. విధి

౧ కలుగువిధియె యున్నఁ గడఁకయే తోఁచు
కలుగని విధి యున్నఁ గలుగు నలసత

౨ జ్ఞానికేఁ జెడువ్రాఁత జడతను గూర్చు
జ్ఞానంబు నలరించు సరి మంచివ్రాఁత

౩ చుఱుకుమైఁ బెక్కు నేర్చుట నగు తెల్వి
కరము హెచ్చగు విధి నడరెడు తెల్వి

౪ చను రెండు తెఱఁగుల జగము ధర్మంబు
ధనవంతు లగుటొండు తద్జ్ఞులౌటొండు

౫ చెడ్డవియగును మంచివియు మంచివిగఁ
జెడ్డవియగుచుండు శ్రీ స్వభావమున

౬ నిలువవు కానివి నిలిపినయేని
తొలఁగవు తనయవి త్రోఁచినయేని

౭ కోటి గూర్చిన విధి కొఱచూపు చూడఁ
బాటిగాఁ బొందెడు పరిపాటి యరిది

౮ పడుపాట్లు విధి కుడుపక పీడునేని
తొడిఁబడి సన్న్యసింతురు బీదలెల్ల

౯ చొక్కఁడు వారలు సుఖమగు వేళ
పొక్కుట యేలొకో పొడమఁ గష్టములు

౧౦ ఎది తాఁదలంచిన నెదుటఁ దా నిలుచు
విధికి బలీయంబు పృథివిలోఁ గలదె ?

# ౨. అర్థకాండము

## రాజపద్ధతి.

### ౩౯. రాజమహిమ.

౧ కోట దేశము మంత్రి కోశంబు హితులు
మేటి సేన గలాఁడె మేల్బంతి నృపుల

౨ బెదరమి యీవి తెల్వియు నుత్సుకతయు
వదలక యుంట భూవరు స్వభావంబు

౩ తేఁకువ విద్దియు తెంపు నన్మాఁడు
పోక యుండఁదగిన భూపు గుణములు

౪ పాడి దప్పక నిల్చి పాపంబు లడఁచి
వాఁడి మానము గల్గువాఁడె మన్నీఁడు

౫ అరసి చేరిచి కాచి యీరఁ బంచుటలు
జరగించు నేర్పుతోఁ జనువాఁడు ఱేఁడు

౬ కానఁగ సులభుఁడై కఠిన వాక్కులను
మాను ఱేని జగంబు మఱిమఱి పొగడు

౭ ఇంపుపల్కుల నిచ్చి యేలు నేర్పరుల
పంపును సముఖంబువలెఁ గొను జగము

౮ నీతిని నడచు స్వనిచయంబుఁ గాచు
భూతలేశుని దైవముగ నెంచు జనము

౯ హితుల కటూక్తుల నెద సైఁచునట్టి
క్షితిపు గొడుగునీడఁ గ్రీడించు జనము

౧౦ ఈవి ప్రసన్నత యేల్బడి జనులఁ
గావుట గలఱేఁడు కనువెల్గు ప్రభుల.

## ౪౦. విద్య.

౧ పడయుము సద్విద్య పారము ముట్ట
నడవుము నేర్చిన నాణెంబు దెలియ

౨ అక్కరంబులు నంకె లనునవి రెండు
నిక్కంబుగ నరుని నేత్రంబు లగును

౩ కఱచిన వారలే కనులు గలారు
కఱవని వారికా కన్నులు పుండ్లు

౪ ఎలరఁజేరి మరల నిటులెప్పు డనఁగ
వెలలు శీలంబు వివేకుల కొప్పు

౫ కలవానికడ బీదకరణి నేఁకరుచుఁ
దెలియు నుత్తముఁడట్లు తెలియఁ డల్పుండు

౬ చెలమ చల్లుకొలంది చెలఁగు నీరట్లు
తెలియు కొలందిని తేటయౌఁ దెలివి

౭ చదువరి కన్ని దేశంబులు తనవె
చదువ రేల యెఱింగి చచ్చెదుదనుక ?

౮ చదువ నేర్చిన నొక జన్మంబునందు
వదల కొందవు నేడు భవముల యందు

౯ క్షమించు దాని నితరు లెంచుటెఱిఁగి
ప్రేమింత్రు మఱియు వివేకు లావిద్య

౧౦ తెఱుఁగు లేనట్టి పెద్ద ధనమగు విద్య
పెఱయవి సిలుకడ పీడినట్టివియు.

## ౪౧ చదువు.

౧ చదువని యజ్ఞుండు సభను మాటాడు
టది నెత్తపలక లేకాడిన కరణి

౨ చదువని మనుజుండు సభ నాడు కోర్కి
ఎదపుట్టువులు లేని యెలనాఁగ కోర్కి

౩ చదువరుల యెదుటఁ జదువనివారు
వదరకుండిన మంచివారె యగుదురు

౪ చదువని వాఁడొక్క చక్కటి చెప్పఁ
జదువరుల్ గొనరు లక్ష్యంబుగా దాని

౫ చదువనివాని విజ్ఞాన గౌరవము
వదరఁబూనినఁ జెడుఁ బ్రాజ్ఞుని యెదుట

౬ కలవారలను మాత్ర గాదుప్పు చోటి
పొలమంత్రు చదువును పొరయునివారు

౭ పొలుచు సూక్ష్మమతిని పొందని మేని
పొలుపు పోలును మట్టిబొమ్మ కైసేఁత

౮ చదువరి లేమిచేఁ జనుచెట్టకంటెఁ
జదువిఁడి సిరియె యొసఁగు హెచ్చుచెట్ట

౯ చదువని వాఁడు మేల్జాతిఁ బుట్టినను
చదివిన కులహీను సాటిగాఁడెన్న

౧౦ చదువరుల్ గలచోటఁ జదువనివారు
మొదలు సరులలోన మొకము లున్నట్లు.

## ౨౦. వినికి.

౧ కలుములందు వినికి కలిమియే కలిమి
కలుము లన్నిటి మేటి కలిమి యాకలిమి

౨ ఓరెంబు వీనుల కొనఁగూడ నపుడె
యోరిమిత్తురు కొంత యుదరంబునకును

౩ వీనుల కోరెమా వినికిగలారు
మానసీయులు దేవమహిత సన్నిభులు

౪ కఱవని వాడైనఁ గన వినఁ దగును
కొఱయుగుచోఁ బట్టుఁగొమ్మయా నదియు

౫ నడవడి మేల్మి యొనరు వారివాక్కు
అడుగు జాఱిన తఱినగు నూతఁబోలు

౬ పిన్నదైనను మంచి వినఁదగు నెమ్మి
పిన్నదయ్యును నిండు పేరిమి నిచ్చు

౭ అరసి యెఱింగి పాయక విన్నవారు
పొరపడి యేనియుఁ బొచ్చెంబు లనరు

౮ వినఁదగు విషయముల్ వినని యాచెవులు
వినఁగల్గియుఁ జెవిటి వితమగు నిజము

౯ న్యాయసూక్ష్మముల విననివార లెపుడు
పాయక వినయ వాక్పటిమ లొందరిది

౧౦ చవిచెవి లేక వాచవి గలవారు
భువిని మనిన నేమి? పొలిసిన నేమి?

## ౪3 తెలివి కలిమి.

౧ ఎఱుక కీడుల దోర్చి యేపారు కత్తి
వెరవారఁ బగఱ కభేద్యమౌ కోట

౨ పోవుత్రోవను మదిఁ బోనీక కీడు
పోవ మంచిది నేర్పు పోకయే తెలివి

3 ఎవరెవ రేదేది యెట్లు చెప్పినను
తవిలి సత్య మరయు దారియే తెలివి

౪ పరులకుఁ దేలికపడఁ దాను తెలిపి
యొరుల వాక్సూక్ష్మంబు లారయుట తెలివి

౫ జగముతో స్నేహించి చనుఁ గొప్ప నందు
మొగి హెచ్చుతగ్గులు పూనమి తెలివి

౬ జగమెట్లు నడచు నా చంద మెఱింగి
జగముతోఁ బాటు తాఁ జనునదే తెలివి

౭ విజ్ఞులు రాఁగల విధి యెఱుంగుదురు
అజ్ఞు లవ్విధముల నరయంగ లేరు

౮ వెఱవమి యజ్ఞత వెఱవనౌ పనికి
వెఱచుట నైజంబు విజ్ఞులకెల్ల

౯ రాఁగల దెఱిఁగి మోర్వఁగఁ దెల్వి గలుగ
గాఁగల చెడుగేది కడు భయ మంద?

౧౦ నెఱి తెల్వి గలుగ నన్నియుఁ గలవారె
నెఱి తెల్వి లేమి నన్నియు లేనివారె.

## ౪౪ చెడుగు నీఁగుట.

౧ గర్వంబు కోపంబు కామంబు లేని
యుర్వీశుపేర్మి మేలోసఁగున దగును

౨ దురభిమానం బతితోషంబు లోభ
మరయ దోషములగు నవనీశ్వరునకు

౩ కోఱ్ఱంత తప్పైన గుణవంతు లుర్వి
మఱ్ఱిచెట్టంతగా మది నెన్ను వారు

౪ దోసఁగులే నృపులకుఁ దుదిఁ గూర్చుఁ గాన
దోసఁగుఁ గావఁగఁదగు దోర లిబ్బివోలె

౫ వచ్చెడు మున్న కోవని నృపు మేల్మి
చిచ్చు ముందటి వామిచెలువునఁ జెడును

౬ తనకీడు నీఁగి యితరుల దోసములఁ
గను ప్రభువునకు రాఁగల దోసఁగేది?

౭ చేయంగఁ దగినవి చేయని లోభి
శ్రేయంబు నిలుకడ చెడి నశియించు

౮ పెనుపట్టు గలయట్టి పిసినితనంబు
ఘన దుర్గుణములలోఁ గడదాఁటు మెట్టు

౯ తను తాఁ బొగడికొంట తగదెన్నఁడేని
గొనకొనరాదెన్నఁ గొఱలేని పనుల

౧౦ పరు లెఱుంగక కోర్కి పడసిన నృపతి
నొరులు జయింప వీలుండ దాదారి.

## ౪౫ సత్సహవాస సంగ్రహము.

౧ తగవెఱింగిన గొప్ప తద్జ్ఞుల చెలిమి
వగ యెఱింగి యరసి వలయుఁ గొనంగ

౨ కలకీడు తొలఁచి రాఁగల కీడు గావఁ
గలవారి చెలిమిని కైకొనఁదగును

౩ ఘనులను మన్నించి కలుపు గోల్తనము
కన నరుదగు వానఁ గడుగొప్ప యరిది

౪ తనకంటె ఘనులను తనవారిఁగాఁగఁ
గొనుట బలములందు గురుతమ బలము

౫ కన్నులు సచివులే కావునఁ బతికి
నెన్నుకోఁదగు వారి యెడ వివేచించి

౬ తగువారు తోడుగాఁ దనరిన నృపతి
పగఱ కష్టములచేఁ బాడొట లేదు

౭ చెడుగుల ఖండించి చెప్పెడివారిఁ
బడసిన పతి నొంచు పగవారు గలరె!

౮ ఖండించి మతిసెప్ప ఘనులు లేపపతి
యుండలేమిం జెడు నరులు లేకున్న

౯ బండవలము లేక పడదు లాభంబు
అండలేని నృపతి కస్థి నిల్కడయు

౧౦ ఘనమైత్రి విడుట పెక్కుండ్రడతోఁ జలము
గొనుకంటె బది మడుంగులు కీడు పతికి.

## ౪౬ క్షుద్రసంసర్గ వర్జనము.

౧ కడుక్షుద్రమైత్రికి ఘనత భీతిల్లుఁ
బడయుఁ జుట్టముగ నల్పత్వంబు దాని

౨ జలము చేరిన మట్టి చవి నొందినట్లు
తెలివి కూడికఁబట్టి తేఱును మార్పు

3 ఎట్టిది యెడఁద యట్టిది తెల్వి యగును
ఎట్టిది చెలిమి యట్టిది కీర్తి యగును

౪ తెలివి మనసునుండి తేఱిన కరణిఁ
దెలిసి కూడికనుండి తేఱుచునుండు

౫ ఎడ తేట పని తేట యెసలార రెండుఁ
నడరుఁ గూడిక తేట యలరిన యెడల

౬ మంచిసం తలరును మది తేటయైన
మంచి కానిది లేదు మైత్రి తేటైన

౭ మంచిమది యొసంగు మంచి సత్త్వమును
మంచి మైత్రి యొసంగు మంచి కీర్తులను

౮ మది మేల్మి యొప్పిన మహాత్ములకేని
కొదలేని చెలిమి చేకూర్చును బలిమి

౯ మంచి మదిని భావి మంచిది యగును
మంచి చెలిమి దాని మహిమకు బలిమి

౧౦ మంచి చెలిమి కంటె మఱి తోడు లేదు
కొంచెపుఁ జెలిమి కెక్కుడు గాసి లేదు.

## ౪౭ విమర్శించి చేయు విధము.

౧ కానిది యగునది కాఁగల ఫలము
మానుగాఁ జర్చించి మఱి చేయఁదగును

౨ తెలిసిన హితునితోఁ దెలియ యోచించి
తలపోసి చేయఁ బొందని దేది కలదు?

౩ మొదటికి మోసమై పోలుపఱు పనులఁ
దుది ఫలంబారసి తొడరరు బుధులు

౪ ఎగతాళి యగునని యెదజంకువారు
వగవక తేఱని పని పూనరెపుడు

౫ వగయారయక యెత్తుపనియున్న నద్ది
పగ ఉన్నచోటనే ప్రబలించు దారి

౬ చేయంగఁ దగనివి చేసినఁ జెడును
చేయంగఁదగినవి చేయమిఁ జెడును

౭ చేయంగఁదగు వివేచించి కార్యములు
చేయు పిదప వివేచించుట కీడు

౮ తెరువు నారసి ప్రయత్నింపని పనులు
నెఱవేఱ వెందఱు నిలిచి కాచినను

౯ పరుల గుణంబులఁ బాటింపకున్నఁ
బొరపునఁ జెడు మంచి పోకనో పనియు

౧౦ జగమెప్పుడు పరువు సమయు పద్ధతుల
నెగతాళి కాని తీరెంచి చేయఁదగు.

## ౪౮ శక్తి నెఱుఁగుట.

౧ తనశక్తి పరశక్తి తన కార్యశక్తి
తనతోడు శక్తిని తలఁచి చేయఁదగు

౨ తనశక్తి సాధ్యంబు తగ వివేచించి
మనసు నిలిపి సేయ మఱి కానిదెద్ది?

౩ తమశక్తి నెఱుఁగక తమకించి నడుమ
సమసినవారు భూస్థలిని పెక్కండ్రు

౪ తగువారిఁ గలియక తనశక్తిఁ గనక
పొగడుకొన్న ధరావిభుఁడు వేగ చెడును

౫ నెమిలి యీఁకల వహించిన బండియేని
అమితమౌనెడఁ దప్ప కక్షంబు విఱుఁగు

౬ చెట్టుకొట్టకొనకుఁ జేరి తా మఱియు
నెట్టన పోఁబూన నీఁగుఁ బ్రాణములు

౭ యోగ్యత పరిమితి యొందిన యీవి
భోగ్యమైనట్టి సొమ్మును కాచుత్రోవ

౮ ఆయంబు మితి తగ్గ వ్యయము పరిమితియు
నాయతి కాదేని యగు కీడు లేమ

౯ కొలఁది యెఱుంగక కొఱలెడు బ్రతుకు
కలిగిన యదివోలెఁ గాన్పించి చెడును

౧౦ తన యోగ్యతకు మించి ధనము వ్యయింప
ననయు మబ్బును తుది కడుగంటఁ జెడును.

## ౪౯ కాలము నెఱుంగుట

౧ పగట జయించు గూబను మీఱి కాకి
పగఱ గెల్వ నదను వలయు భూపతికి

౨ కాలంబుతో నొంటి క్రాలుట కలిమి
వ్రాలక కట్టెడు త్రాడుగా నొప్పు

3 తగు సాధనములతోఁ దఱి వేచి పనుల
నొగిఁ జేయఁ గానివి యుండునె యెందు?

౪ స్థలము కాలమును విచారించి చేయ
నిలయెల్లఁ గోరిన నేలంగనగును

౫ ఇలయెల్ల నేలఁగా నెంచినవారు
కలఁత పడక యుంద్రు కాలంబు వేచి

౬ తఱివేచి బలియుండు తగ్గియుండుటలు
ఒఱయు డీకొను తగరొగ్గుటఁబోలు

౭ సుమతులు వెంటనే చూపరు కినుక
తమలో నడఁచియుంద్రు తఱి యబ్బుదనుక

౮ తఱివచ్చుదాఁక శాత్రవునకు లొంగఁ
దఱిరాఁగ శాత్రవు తల క్రిందిదగును

౯ ఒందఁదగిన తఱి యొనఁగూడినపుడె
చెందఁదగిన వానిఁ జేయంగ వలయు

౧౦ తఱిగాని తఱి నుండఁదగుఁ గొంగవోలె
దఱిరాఁగ సాధింపఁదగు దానిఁబోలె.

## ౫౦ స్థానము నెఱుఁగుట

౧ తగుచోటు పూర్తిగాఁ దాఁ గాంచుమున్న
తగదు దండెత్తంగఁ దగదు క్రేడింప

౨ పగఱ నెదిరి గెల్చు పటిమ యుండినను
తగఁ గోటనుండి యుద్ధము సేఁత నయము

౩ స్థలము రక్ష యెఱింగి శత్రువు నెదుర
బలహీనుఁడును గెల్చు బలయుతునేని

౪ తన యిమ్మెఱిఁగి రాజు తగ నిల్చిపోరఁ
దనుగూర్చి పగ తెంచు తలఁపులు చెడును

౫ మొసలి యన్నిటి గెల్చు మొగి నీటనుండ
మొసలి నన్నియు గెల్చు మొగి నీరు వీడ

౬ పుడమి నడచు తేరు పోవదు కడలిఁ
గడలి నడచు నోడ కదలదు పుడమి

౭ అఱలేక యెంచి యిమ్మగు చోటఁ బోరఁ
బెఱలేల ధైర్యమే పెందోడు దక్క

౮ అనువైనచో నిల్వ నల్ప సైనికుఁడు
పెనుసేన గల తేని వీఁక నశించు

౯ కోటయు సేనయుఁ గొఱవైన శవర
చోట నతని గెల్చు చొప్పు దుష్కరము

౧౦ కడురూపు బల్లెముల్ గల మోము దంతి
యడుసునఁ బడ నక్క కలవియౌఁ జంప.

## ౫౧ తేర్చి ఎన్నికొనుట

౧ పాటి కలిమి ప్రేమ భయము లందొకని
పాటి వివేచించి వలయుఁ జేకొనఁగ

౨ కులము శౌచము నిందకుం గొంకు లజ్జ
గలవాని భూపతి కైకొనఁ దగును

౩ తెలియ నేరిచి కీడు త్రెంచినవారి
వలననే నొక వైపు వఱలక పోదు

౪ గొనమును చెడుగును గొని రెంట నేది
ఘనమగు నది నిసర్గం బనఁదగును

౫ గురుత లఘుత గనుఁగొన నొరగల్లు
పరఁగ నవ్వారల పనులె పో జగతి

౬ పరిశుద్ధులను తేర్చి పతి కొనఁదగును
పెరవారు పట్టిఁడుల్ వీఁగరు నడికి

౭ ప్రేమంబుచే నవివేకులఁ గొనిన
భూమీశునకు నన్ని పొరపులు గలుగు

౮ ఒరుని పరీక్షింప కొప్పి కొన్నతని
తరతరంబులుఁ గీడు తప్పక కుడుచు

౯ పరికింప కెవరిఁ జేపట్టంగఁ దగదు
పరికించి తేఱిన పని యీయఁదగును

౧౦ తేఱమిఁ గొంటయుఁ దేఱ శంకిలుట
తీఱని యిడుమలఁ దెచ్చు భూపతికి.

## ౫౨ తెలిసి పనిగొనుట

౧ మంచిని చెడుగును మఱి మఱి యరసి
మంచి గుణాఢ్యుని మన్నింపఁదగును

౨ వరవను పెంచి నిష్ఫలముల నీఁగు
పురుషుండె తేనికొల్వున నుండఁదగును

౩ తెలివి ప్రేమ నిరాశ తేఱుగడయును
కలవానినే తేఁడు కైకొనఁ దగును

౪ కొనముట్టఁ బరికించి కొనువార లందుఁ
బనులలో మార్పడువారు పల్వుంద్రు

౫ తెలిసి యోరిచి తీర్చు తీర్పరి కీక
చెలిమికానికి పనుల్ చెప్పుట తగదు

౬ పనియు నదను చేయువాని లక్షణము
గనుఁగొని నెఱవేర్పఁగాఁ దగుఁ బతికి

౭ దేనిచే నెవ్వండు దేని నెగ్గించు
దాని నాతని కీయఁదగు నెఱవేర్ప

౮ పనికిఁ దగినవానిఁ బరికించి పిదపఁ
బనుపఱుపందగు వాని నాపనికి

౯ పనిపట్లఁ గను గల్గు వాని సన్మైత్రి.
జనపతి తప్పఁగాంచఁగ సిరి పాయు

౧౦ పనివాఁడు పని మాఱుపడఁ జేయఁడేని
జనము మార్పడదని చనునెంచఁ బతికి.

## ౫౩ బంధుప్రేమ

౧ పేదయైనవాడను ప్రాపితము పీడకయ
ఆదరించుట గుణంబగు బంధువులకు

౨ ప్రేమ విడని చుట్టరికమబ్బునేని
ఏమాడ్కిఁ జెడని మేలెసఁగుఁ జెక్కులుగ

౩ చుట్టాలఁ బ్రేమతోఁ జూడని బ్రదుకు
గట్టు తెగిన తటాకము నిండు రీతి

౪ కలిమిగలాని కా కలిమి ఫలంబు
బలసి బందుగులుండ వర్తించుటయగు

౫ ఇచ్చుట ప్రియవాక్కు లెలమితోనున్నఁ
బెచ్చుగా బందుగుల్ వేష్టించియుంద్రు

౬ ఈవరిమై కిన్కనొడఁ బ్రగుంచునతని
కైవడిఁ జుట్టాలఁ గలవాఁడు లేఁడు

౭ పిలిచి కాకి భుజించు విధి బంధువులను
కలిసి మెసవువాని కలిమి వర్ధిల్లు

౮ తరతమ మరసి భూధవుఁడు మన్నింప
జరగుదు రవ్విధి జనులు పెక్కండ్రు

౯ విడిన చుట్టంబులు పిదపఁ జేరునెడ
విడిన దోసము లేని విధమదే తెలుపు

౧౦ వదలిన బంధువు పనివడి రాఁగఁ
గొంద నెఱవేర్చి కైకొనఁదగు నరసి.

## ౫౪ మ ఱ వ మి

౧ అధిక కోపముకంటె నదిచాల చెడుగు
అధిక మోదముచేత నైన నైమఱపు

౨ తిరిపంబు చంపును తెలివిఁ బూర్తిగను
మఱపు కీర్తిని చంపు మానక యట్లు

౩ మఱపొందువారికి మలయదు కీర్తి
నెఱ నిక్క మది యెట్టి నియతులకేని

౪ అడలు వానికి రక్ష నగు ఫలంబేది?
ఎడ మఱచినవాని కెనయు మేలేది?

౫ మొదట మఱచి రక్ష పూననివాఁడు
పదపడి తపియించు పగనొంద నెఱిఁగి

౬ ఎడలేక యెవ్వ రెయ్యెడనేని మఱపు
పడయమికంటె మేల్ భావింప లేదు

౭ మఱవని యెదతోడ మతి వివేచించి
జరప నశక్య మొచ్చుట నేది లేదు

౮ జరుపంగఁదగు నుతి సల్పున వరసి
మఱచిన నేడు జన్మములందు లేదు

౯ మఱచి చెడినవారి మతి యెంచఁదగును
మఱవక యుండఁగా మది సంతసమున

౧౦ మదిఁ గోరినది మతిమతి వివేచించి
వదలక నడపఁ దాఁ బడయుట సుళువు.

## ౫౫ న్యాయపాలనము

౧ అరసి మోమోటలేకటు తటస్థుఁడుగ
జరపునదే యగు జగతి న్యాయంబు

౨ నడచు లోకంబు వానంబట్టి యలరి
నడచు జనము ఱేని న్యాయముంబట్టి

౩ వేదకర్మములకు విహిత ధర్మముల
కాదరువగు రాజు న్యాయపాలనము

౪ వదలక ధర్మంబు ప్రజఁ గాచు నృపతి
పదముల వదలక వర్తించు జగము

౫ న్యాయపాలన సేయు నధిపతి నాఁటఁ
బాయక కురియుట పండుట హెచ్చు

౬ జయము నిచ్చునది శస్త్రము గాదు పతికి
నయ మదియుఁ గ్రమమ్ము నశియింపదేని

౭ కాపాడు నృపుఁడు లోకము నెల్ల, నతనిఁ
గాపాడుచుండు వక్రత లేని నీతి

౮ నరులకు మొగమిూక న్యాయంబు గనక
పరఁగు విభుఁడు చెడుఁ బలుచనయుండి

౯ చెడుగులఁ దొలఁగించి చిక్కులూడ్చుటలు
వెడఁగుఁదనము గాదు విధియగుఁ బతికి

౧౦ ఖలులను చంపఁగాఁ గడఁగుట పతికిఁ
గలుపు దీసి పయిరుఁ గాచుటఁబోలు.

౫౬ — క్రూర పాలనము

౧ కొలను మాత్స్యంబుగాఁ గొనువానికంటె
హింసించుటయె పనియగు ఱేఁడు కీడు

౨ ఏలిక సాధించు సొమ్ముఁ గత్తిఁగాని
క్రాలు చోరుఁడు వేఁడు కైవడి నుండు

౩ నాఁడునాఁటికి ఱేఁడు నాఁడెల్ల నరసి
పాడి నిలుపఁడేని పతికి వోవు సరవి

౪ అరయక దుర్నీతి నడుగు రాజునకు
సిరియును బ్రకృతియుఁ జెడిపడు వడిగ

౫ కడగండ్లఁ బడు ప్రజ కన్నీరుగాక
యొడయుని సిరిఁ ద్రెంప నొండున్న కత్తి?

౬ నిలుకడ ప్రభునకు నీతిపాలనమె
నిలువర మది లేక నెగడదు కీర్తి

౭ ఱేఁడు నిర్దయుఁడైన రెక్కొఁను చెడుగు
పాడు వఱపుచేతఁ బ్రజపాట్లఁబోలు

౮ ఖలుఁడగు భూపాలు కడనుండు ప్రజకుఁ
గలిమి యెక్కుడు కీడు గద లేమికంటె!

౯ పాడి దప్పిచరించు ప్రభుని దేశమున
నోడు నదన వాన నోనఁగ మొగుళ్లు

౧౦ ఏలిక యేలని యెడఁ బాఁడిపంట
ప్రీలును మఱతురు విప్రులు శ్రుతుల.

## ౫౭ భీ తి క లి గిం ప ము

౧ అరసి మధ్యస్థుఁడై యవ్వాలఁ జెడుగు
జరుగనీక విధింపఁజను భూమిపతికి

౨ సిరి చిర మొడయక శిక్షింపఁగోరఁ
బరుసనచూపి చొప్పడఁదగుఁ బతికి

౩ బెట్టిదుఁడగుచు దుర్విధిని పాలించు
కట్టిఁడి చెడును తక్కక శీఘ్రమునను

౪ ప్రభువు కఠినుఁడను పరుసని నుడులు
విభు నాయువు హరింపఁ వెస నాసిరిల్లు

౫ సులభ ప్రసన్నతల్ చూపని ఱేని
కలిమి వేఁదుఱు వట్టు గతి నశియించు

౬ పరుషవాక్కులు నెదపరుసు గలాని
సిరి నిలుకడ దప్పి చెడును వెన్వెంట

౭ భయద వాక్యంబులు పరుష దండనము
జయలక్ష్మిఁ దెగఱాచు సరియాకుఱాల్లు

౮ మొదల సోమరియయి ముట్టవచ్చునెడ
గొదగొని కోపింపఁ గ్రుంగును కలిమి

౯ తన రక్షణము తొల్తఁ దలఁచని నృపతి
అని తఱి బెలుకుఱి యతి వేగ చెడును

౧౦ చెడుఱేఁడు మొఱకులఁ జేకూర్చికొనును
పుడమికి లేదొండు మోపంతకంటె

## ౫౮ కనికరము

౧ కనికర మనియెడి కడుగొప్ప తోడుగఁ
గొనియుంటచే నిల్వు గొన్న దీజగము

౨ దయచేతనేకదా తనరు లోకంబు
దయలేని మనుగడ ధరణికి బరువు

3 లయలేనిపాట ఫలంబున్న పాడ?
దయలేని కన్ను వ్యర్థము కాదె చూడ?

౪ కనికరమును వీలు గలయంతవఱకుఁ
గనని కన్నుంగవ గలిగియు ఫలమొ?

౫ కనికర ముండుటే కనులకుఁ దొడవు
కన నది లేనివి గండ్లును పుండ్లు

౬ కన్నులుండియుఁ గనికరము లేనతఁడు
మన్నుపైని జెముడు మ్రాఁకును పోలు

౭ కనులుండి గ్రుడ్డి యక్కటిక లేనతఁడు
కనులుండి దయలేమి కలుగుటలేదు

౮ కర్మంబు చెడకుండఁ గరుణించు వలఁతి
కర్మిలి సొంతమై యమరు నీ జగము

౯ పఱచు చుండెడివారి పట్టున నేని
తఱచు కరుణచూపు దారి యొప్పిదము

౧౦ కోరఁదగిన దయఁ గోరెడివారు
కోరి విసంబీయఁ గుడిచి కూడెదరు.

## ౫. వేగుల నంపుట

౧ మెలఁకువ గల వేగు మేటి శాస్త్రంబు
తిలకింప ధరణి పతికి రెండు కనులు

౨ అందఱకు వలయు నన్నింటి సతము
పొందిక నెఱుఁగుట భూపు ధర్మంబు

3 వేగుచేఁ దెలిసి వివేచింపకున్న
సాగి జయము గొంట జరుగదు పతికి

౪ తనకొల్వుకాండ్ర మిత్రముల శత్రువుల
జనములఁ బరికించు చతురుఁడే వేగు

౫ అరమర గనని రూపడలమి యెపుడు
పొర వీడమియుఁ గల ప్రోడయే వేగు

౬ యతిగ వ్రతిగఁ జని యరసి కన్నయది
యితరు లేచిన వెలయింపఁడు వేగు

౭ మఱుఁగుల విననేర్చి మది విన్న వాన
నఱమఱల్ తేర్చికొన్నతఁడె పో వేగు

౮ వేగుచే మఱుఁగుల విని వేఱొకండు
వేగుచే వానిని విని గ్రహింపఁదగు

౯ ఒకని నొక్కరెఱుంగకుండఁగా ముగ్గు
రొక తీరయుగు దాని నొగి తేర్పఁదగును

౧౦ పెఱవార లెఱుఁగఁగా బిరుదీయఁ దగదు
ఎఱిఁగినఁ దనమఱుఁ గెఱిఁగించుటె యగు.

## ౬౦ ఉత్సాహ సంపద

౧ కలవారలన నుత్సాహత కలరనుట
కలిగియు నది లేమిఁ గలవారు కారు

౨ కలుములఁ గడఁకయుఁ గలిమియే కలిమి
కలుములు తక్కు నిల్కడ లేక చెడును

౩ నిలకయా తేఁకువ నెగడిన వారు
కలిమి చెడినదని కడఁగి చింతిలరు

౪ చలనంబు లేని యుత్సాహంపుఁగలిమి
కలవారికడఁ జేరుఁ గలిమి తనంత

౫ జలములోఁతు కొలంది జలజ బిసంబు
తలఁపులోఁతు కొలంది తనరును గరిమ

౬ తలఁ పెల్లఁ బెరిమగాఁ దలపోయఁ దగును
తలఁపు కూడక యున్నఁ దగ వీడఁదగదు

౭ కలఁగ దేనుఁగు తూపు గాఁడి నొంచినను
కలఁగఁడు తేఁకువ గలవాఁడు నొవ్వ

౮ ఉల్లమున నొకింత యుత్సాహగరిమ
చెల్లనివారు వాసిని గాంచలేరు

౯ కొండంతమెయి వాఁడి కొమ్ములు గలిగి
బెండువడును దంతి బెబ్బులిఁ గన్న

౧౦ ఉరు మనశ్శక్తియే యుత్సాహశక్తి
పొరయని వాఁడద్ది భువి నరతరువు.

## ౬౧ ఆలస్యము లేమి

౧ కులమును నాఱని గొప్పదీపంబు
అలసతయను పొగ యడరంగ నాఱు

౨ తమ కుటుంబపు వృద్ధిఁ దగఁగోరువారు
సమయింపఁదగు నలసత నలసతగ

౩ ప్రాలుమాలిక గొని బ్రదుకు నజ్ఞాని
క్రాలువంశము చెడుఁ గనుచుండఁ దాని

౪ అలసత గొని మంచి యలవాట్లు విడువఁ
గొలము తఱిగి దొసంగులు పెనుపారు

౫ అలసత తామస మలనిద్ర మఱపు
నిలుగఁగోరెడు వార లెక్కుపడవలు

౬ చాలఁగా భూపాలు సాయ మబ్బినను
ప్రాలుమాలిన గొప్ప ఫలమబ్బు టరిది

౭ అలసత గొని మంచి యలవాట్లు విడుచు
ఖలులు పరులు దిట్టఁ గైకొంద్రు వింద్రు

౮ ప్రాలుమాలిక జనపతి నాశ్రయింప
నేలించుఁ బగవారియెడ లొంగఁజేసి

౯ కులము నేలుటయందు కొఱలెడి దోసఁగు
తలఁగును పతికి బద్దకము పోఁద్రోల

౧౦ అల త్రివిక్రము నట్టు లాడిన వెల్ల
గెలువఁగలఁడు బద్దగింపని ఱేఁడు.

## ౬౨ మనుజయత్నము

౧ కానిది యని కొంకు కై కొనఁదగదు
పూనిక వలసిన పోడిమి నొసఁగు

౨ పని ముగింపక వీడఁ బ్రకృతియు వీడు
పనిముగియు దనుక వదలంగఁ దగదు

౩ ఎచట దిట్ట కడంక యిరవొందియుండు
నచటనే యుపకార మను గుణముండు

కడఁక యొప్పని యుపకారగుణంబు
జడుపరి కై దువు చందాన వితథమె

౫ సోము గోరక కార్యశూరుఁడౌ వాఁడు
ప్రేముడి చుట్టాల పెన్నూఁతకోల

౬ పూనిక కలిమిని పొలుపారఁజేయుఁ
బూనిక లేమి తాఁ బూన్చు నెద్దడిని

౭ యత్నహీనుని కడ నడరు మూదేవి
యత్నవంతుని గొల్చి యలరు శ్రీదేవి

౮ తప్పుగాదది విధి తప్పఁజూచినను
తప్పగు నెఱిఁగి యత్నము సేయకుంట

౯ ఇడకున్న విధి తన యిష్టఫలంబు
నొడలిశ్రమకుఁ గూలి యొసఁగు యత్నంబు

౧౦ అడలక యెడపక యత్నించువారు
తడయక దుర్విధిం దఱుమఁగలారు.

## ౬౩ కష్టము నోర్చుట

౧ ముద మొందఁదగుఁ గష్టములురాఁగ వాని
నెదిరి దాఁటఁగ నగు నెంతో ముదమ్ము

౨ కడగండ్లు వెల్లువ కరణిని వచ్చుఁ
గడచు నంచుఁ దలంపఁ గడచును నవియు

ఇడుమల కడలని యెడఁద గలారు
ఇడుమల కిడుమల నొసఁగింపఁగలరు

౪ ఎడరు గలుగ బండి యెద్దట్లు కడవ
నిడుమలే మిక్కిలి యిడుమల నొందు

౫ ఎడయక విఘ్నంబు లెనయ యత్నంబు
నెడపఁడేని యిడుము లిడుమలఁ గుడుచు

౬ పడసితిమని లోభపడనట్టి వారు
చెడితి మనుచు వగ చెందఁగాఁబోరు

౭ ఒడలు పెక్కిడుమల కునికి యంచెఱిఁగి
యిడుమల నిడుములం చెన్నరు ఘనులు

౮ ముదముగోరక దుఃఖములు నైజము లని
మదిఁదలంచిన నిడుమల నొందఁడతఁడు

౯ సంతసంబున సంతసము నొందనతఁడు
చింతలోఁ జింతను చెందఁ డెన్నండు

౧౦ ఇడుమలె యించునం చెంచిన యతఁడు
పడయు నున్నతి తన పగవారుఁ బొగడ.

# రాజ్యాంగపద్ధతి

## ౬౪ మంత్రిత్వము

౧ వగ సాధనము వేళ పని నెఱవేర్పు
తెగ లెఱింగిన వాఁడె తేఱిన మంత్రి

౨ దిటవు విజ్ఞానంబు తెఱఁకువ కార్య
పటుత ప్రకృతిరక్ష వలయు మంత్రితకు

౩ భేదంబు సంధియు విడిచినవారి
నాదరించుచుఁ జేర్చు నట్టిఁడు మంత్రి

౪ అరయుట తేర్చి కార్యముచేఁత యొక్క
తెరువునఁ బల్కుట తెలియును మంత్రి

౫ తగవెఱింగి వచించు తద్జ్ఞత దిటవు
తగడీనవాఁడె యానికతోఁడు పతికి

౬ తెలివిచే శ్రుతులచేఁ దేఱు కౌశలము
గలవారికి నసాధ్య కార్యముల్ గలవె?

౭ కార్యపద్ధతి తాను కాంచినయేని
యార్యపద్ధతి నరయందగుఁ జేయ

౮ తెలియక తెలిపినఁ దెలియని పతికిఁ
దెలుపుట విధి మేలు తెలియు మంత్రులకు

౯ చెడుగెంచు మంత్రిని చేకొనుకంటెఁ
బడయుట మేలు డెబ్బదికోట్ల పగఱ

౧౦ పనియందు స్థిరమతి పడయనివారు
అనుకూల మెంచియు నందరు ఫలము.

## ౬౫ పలుకు నేర్పు

౧ నాలుక మంచి యన్యాయము మేల్లందు
మేలు గాదది మేర మీఱిన పైది

౨ కలిమియు లేమియుఁ గలుగు వాక్కున నె
పలుకుల ననుకూలపడఁ గావఁదగును

౩ విను వారు కూడఁగా వినని వారలును
వినఁగోరు నదియ పో విశ్రుతవాక్కు

౪ అరసి యింగితము మాటాడంగఁ దగును
పెర లేవు ధర్మార్థ విధు లంతకంటె

౫ పలుకంగఁదగుఁ దన పలుకులఁ బరుల
పలుకు గెలువలేని పద్ధతి నరసి

౬ కొసరంగఁ బలికి యొక్కొని పల్కులందు
రస మెఱుఁగుట మహాప్రాజ్ఞుల నియతి

౭ పలుకు పొందికఁ గొంకు పడయని వాగ్మిఁ
బలుకుల గెలువంగఁ బరులకు నరిది

౮ పలుకుల నింపుగాఁ బనుపడఁ గూర్చి
వలఁతుల నిచ్ఛించి పనివిను జగము

౯ కొలఁది యెఱానముల వాక్కుల నయమారఁ
బలుక నేరనివారె వదరుచుండుదురు

౧౦ ఎత్తి తెలియఁ జెల్ప నెఱుఁగని చదువు
గుత్తి నలరి తావి గొనని పూవదువు.

## ౬౬ కార్యశుద్ధి

౧ కలిమి నొసంగును కలతోడు మేల్మి
తలఁపులెల్ల నొసంగుఁ దగు పని మేల్మి

౨ పేరును మేలును వెలయింప లేని
కారియంబు సతంబు కడత్రోవఁ దగును

౩ పేరిమితోడ జీవింతమన్న వారు
కీరితి చెడు పనుల్ కెడపంగఁ దగును

౪ స్థిరమతి గలవారు సిలుగులు కలఁప
వెఱచి యొనర్పరు వేటిఁడి పనుల

౫ చేయకు బెడిదముల్ చేసిన నొకటఁ
జేయకు మరల నా చేఁతకు వగచి

౬ తల్లియాఁకలిఁ జూచి తలరు వాఁడైన
నొల్లమి తగుఁ బ్రాజ్ఞు లొప్పని పనులు

౭ పడి మోచి కూర్చిన సంపదకంటె
కడు లెస్స లేమిడి ఘనులకుఁ గొంట

౮ తెరలక నింద్యముల్ తెగిచేయు నవియు
నెఱవేఱినను వీడనే యిచ్చుఁ దుదిని

౯ వగవఁ గొన్న యవెల్ల వగవఁగాఁ దొలఁగుఁ
దగు మేలె యొసఁగు సద్ధనము పోయినను

౧౦ చెడుగులతోఁ గల్మి చేర్చి ప్రోచుటలు
ఎడ పచ్చికుండలో నెసరు కాఁచుటలు.

## ౬౭ కార్యదృఢత

౧ పని దిటవున నెద పదిలంబ యగును
కనుఁగొన నితరముల్ కావు దార్ఢ్యములు

౨ చెడుగులు చేయమి చెడు పట్టులందు
నడలమి రెండు ధీరాళి మతంబు

౩ అగుదాఁకఁ బని రహస్యముగ నుంచఁదగు
బుగులు పుచ్చినఁ గష్టములు వచ్చుఁగాన

౪ పలుకు టెల్లరకును బహు సులభంబ
పలికిన తీరునఁ బనిసేయు టరిది

౫ ధీరుని పెను పని దిటవు భూరమణుఁ
జేరి లోకవినుతిఁ జెందు మిక్కిలిగ

౬ తలఁచి నారలు దిట్టతన మొందిరేని
తలఁచిన యవి కొందురి తలఁచిన యటులె

౭ తేరు చక్రపుఁజీల తీరొందువారిఁ
గేరఁదగదు రూపు కీడ్పడియున్న

౮ కలఁగక దిటవూను కర్జంబుపట్ల
తలఁకక తూఁగక తాఁజేయఁదగును

౯ హెచ్చగు కష్టంబు లేపార నోర్చి
చొచ్చి చేయఁగఁదగు సుఖమిచ్చు పనులు

౧౦ ఎట్టి దిట్ట మొనరనేమి? కార్యంపు
దిట్ట లేమిని సమ్మతింపదు జగము.

## ౮౫ కార్య పద్ధతి

౧ నిర్ణయింపఁగఁదగు నిడుమేర యరసి
నిర్ణీత మాలసించినఁ జెడు గగును

౨ తాళఁదగినవానఁ దాళంగఁ దగును
తాళఁదగనివానఁ దాళంగఁ దగదు

౩ చెల్లుచోటులఁ బనిచేయుంగఁ దగును
చెల్లనిచో వివేచించి చేయఁదగు

౪ పగనిల్వ పనినిల్వ పరికించి చూడ
సెగలేని శేషంబు చెన్నునఁ జెఱుచు

౫ ధన కాల కార్య సాధన సదనంబు
లను నైదు తమమఱ నరసి చేయఁదగు

౬ ముగియిక యడ్డంకి ముగియించి పొందఁ
దగుఫల మారసి తలకొనఁ దగును

౭ పనియును పనిచేయు పద్ధతి యెఱుఁగు
పనివాని సమ్మతి పడయుట లెస్స

౮ ఒక మదేభముచే మఱొండు గొన్నటులు
ఒక పనిచే నట్టి వాడఁగూర్పఁ దగును

౯ పొత్తుకాండ్రకు మేలు పూన్పు కంటె మును
పొత్తెడసినవారి పొందికోల్ తగును

౧౦ తనవార లడలఁగాఁ దలరి పిన్నతఁడు
ఘనుల వలన సంధి కావింపఁ దగును.

## ౬౯ దూత్యము

౧ చెలిమియు మంచి వంశికత రాడ్వరులు
వలచు గుణము కలవాఁడెపో దూత

౨ తెలివి ప్రేమ తెలిసి తెలిపెడు శక్తి
కలయువి దూతకుఁ గడు ముఖ్యములుగ

౩ విజ్ఞులకడఁ దాను విజ్ఞుఁడౌ ఫలము
ప్రజ్ఞచేఁ బనిగెల్చు పలుకు పలుకుటె

౪ తెలివియు రూపంబు తేఱిన చదువు
కలిసిన వాఁడెపో కాఁదగు దూత

౫ కీడు దొలఁచి యుటంకించి కార్యంబు
నాడి యలర్చి మేలమరించు దూత

౬ కఱచి చెల్లఁగఁ బల్కి కన్నోటలేక
తఱి కనువు నెఱుంగఁ దగువాఁడె దూత

౭ తగవును స్థానంబు తఱి తగ నెఱిఁగి
వగచి పలుకువాఁడె వలఁతియా దూత

౮ తేటయుఁ దోడ్పాటు తీర్పును గలుగు
మాటనేరుపు దూత మంచి లక్షణము

౯ నుడివిన నుడువుల నుడివి న్యూనతలఁ
దడఁబడి చెప్పని దంటయే దూత

౧౦ చావుఁగూర్చిన దేని జడియక పలికి
భూవిభునకు మేలు పొందించు దూత.

## ౭౦ రాజాశ్రయము

౧ వెగటొందు చపలు సేవించెడివారు
సెగఁ గాఁచుకొన నగ్గిఁ జేరినట్లుండ్రు

౨ ఏలిక వలచిన దిచ్ఛింపకున్న
ఏలికచే నబ్బు హెచ్చైన కలిమి

౩ ఎఱిఁగి మున్న దోసంగు లెడలింపఁదగును
ఎఱిఁగిన విభుఁదేర్చ నెవ్వరి తరము?

౪ చెవిఁజేరి పలుకుట చేరి నవ్వుటలు
నవియింపఁ దగు విభు నఱుత నెవ్వరికి

౫ మఱుఁగులు వినకయు మఱి యడుగకయు
నెఱిఁగింప నెఱుఁగుట యెవరికేఁ దగును

౬ వేళ సన్న యెఱింగి వినుగు కాకుండ
నాలింప వలచునట్లవి తెల్పఁదగును

౭ విన నిష్టపడునవి వినిపింపఁదగును
వినిన నిష్ఫలములు వినిపింపఁదగవు

౮ పిన్నని వరుసని విభు దూఱఁదగదు
ఉన్న మేటి పదవి కొదిఁగి యుండఁదగు

౯ అధిపు గౌరవ మబ్బెనని ధీరవరులు
విధి దప్పు పనులు గావింప రెన్నఁడును

౧౦ ప్రాఁత చనవుచేతఁ బథము తొలంగి
రోఁత లొనర్చు మూర్ఖుఁడు నాశ మొందు.

## ౭౧ ఇంగిత జ్ఞానము

౧ పలుక కున్నను సన్నఁ బనిఁ గనువాఁడు
జలధి పరీత భూజనులకుఁ దొడవు

౨ ఎదలోనియది సంశయింపక యరయు
విదురు నెన్నఁగఁదగు విబుధ తుల్యునిగ

3 పని నన్నచేఁగను ప్రాజ్ఞుని జేఁడు
కొనఁదగు నంగ మొకొం డిచ్చియైన

౪ తలఁపు చెప్పక కను తద్‌జ్ఞులు తక్క-
గల యంగములు గల్గు ఘనులలో మేలు

౫ సన్నల నెఱిఁగెడి జాడ లేదేని
కన్ను లొడలియందు గల ఫలమేమి?

౬ అవల నున్నది చూపు నద్దంబు లీలఁ
దవిలి చూపును మోము తలఁపునఁ గలది

౭ ముదమును విసుగును మున్నడి తెలుపు
వదన నిభం బొందు వసుధను కలదె?

౮ తలఁపు నెఱింగి కృత్యము తీర్చు వారు
కలిగిన వారి మొగముఁ గన్నఁజాలు

౯ కనుచూపు మార్పాటు గనువారలున్నఁ
గనులె తెల్పు నొరుల కంటు నొంటులను

౧౦ కొలువ దొరల పనుల్ కొలత కఱ్ఱలగు
నిల సూక్ష్మమతులు వహించిన కనులు.

## ౭౨ సభ పాఱుఁగుట

౧ పలుకు లుటంకించి పలుకు పావనులు
పలుకంగఁదగు సభాపద్ధతి నరసి

౨ పలుకు పద్ధతిగన్న ప్రాజ్ఞులు సదను
తెలిసి దోసఁగులేక తేర్చి పల్కఁదగు

3 పలుకఁ బూనిన సభాపద్ధతి గనక
పలుకు నేర్పును రాదు ఫలమును లేదు

౪ ప్రౌఢులందున మేటి ప్రౌఢులేఁ గందు
మూఢులందున మేటి మూఢులేఁ గందు

౫ ఘనుల సభను ముందు కడఁగి మాటాడ
కణఁగి యుండుట లెస్స యన్ని లెస్సలను

౬ ఘనుల సభను పల్కఁగ డఁగి తొట్రిలుట
పెనుదారినుండి తాఁ బెడదారిఁ బడుట

౭ కౌతుకులేక సభలఁ గూడి పలికెడి
చతురుల సభఁ దన చదువు రాజిల్లు

౮ తెలియు నేరుపుగల తెలివరు లెదుటఁ
బలుకుట వర్ధిల్లు పాదు నీరిడుట

౯ విదురులలోఁ జెల్ల వివరించువారు
కదియరాదు ఖలుల కడ మఱచియును

౧౦ ఘనులు లేని సభను కడఁగి పల్కుటలు
చినికి నట్లగు సుధ చెదర ముంగిటను.

## ౭౩ సభకు వెఱవమి

౧ వగ యెఱింగి వలయు వానిఁ బల్కుదురు
తెగ యెఱింగి పలుకు ధీరులు సభల

౨ చదురుల సభఁ దమ చదువు చెల్లంగఁ
జదువు వారధికులు చదువరు లందు

౩ పలువురు పగఱ గెల్వఁగఁ జచ్చువారు
కొలఁది మందియె సభఁ గొంకని వారు

౪ నేర్చినవారలు నెఱి యొప్పఁ బలికి
నేర్చిన దెక్కుడు నేర్చిన కడల

౫ తగు రీతిసభల నుత్తర మిచ్చు కొఱకుఁ
దగు శబ్ద శాస్త్రంబు తర్కంబు చదువ

౬ శస్త్రంబు లేలొకో శౌర్యహీనునకు?
శాస్త్రంబు లేలొకో జంకు వానికిని?

౭ పలుక సభను జంకువాని శాస్త్రంబు
కలనఁ బిఱికి చేతి కైదువుఁ బోలు

౮ పండితసభ మేలు పలుక లేకున్న
దండిగా నేర్చు శాస్త్రము నిష్ఫలమ్ము

౯ నేరని వారికంటెను బీదు నేర్చి
పేరొందు ఘనసభ వెఱచెడు వారు

౧౦ బ్రదికి యుండినను జీవచ్ఛవ మంద్రు
చదువు చెల్లఁగఁ బల్క జంకినఁ జదుర.

# కోశ పద్ధతి.

## ౭౪ దేశము

౧ కొఱలేని కర్షకుల్ గురు ధనపతులు
నెఱి గల్గువార లుండిన యదె నాడు

౨ కడు కల్మిచే జనుల్ కాంక్షింపఁ దగుచుఁ
జెడని పంటలఁ దనర్చినయదె నాడు

3 పలు కష్ట నష్టముల్ పైఁబడ నోర్చి
తలయెత్తి యరి యీయఁ దగినదే నాడు

౪ పెనుగొద చెడుపగ పీడని నొవ్వి
యెనయక యుండునదే యగు నాడు

౫ పలుకూటములు లోని పగయును• తేని
కొల కుట్రలేక నెక్కొనునదే నాడు

౬ చెడుగెఱుంగక తప్పి చెడినను పంట
లుడుగని యదె మేల్మి యొప్పిననాడు

౭ ఫలదాద్రి మలనీరు బలమైన కోట
వెలినీరు లోనీరు విషయాంగకములు

౮ ధనమును నీరోగతయుఁ బంట సుఖము
పెనుకాపు నాటి కొప్పిన మండనములు

౯ అలయు సొలయుఁ గల్గునది నాడుకాదు
అలపు సొలపు లేక యగునదే నాడు

౧౦ మన్నీఁడు ప్రజలొంటి మలయని దేశ
మెన్ని గుణములున్న నెనయు నిష్ఫలము.

## ౭౫ కోట.

౧ బలియురకును భీతి బ్రదుకు వారలకు
నిలుకయా కలిమిగా నెగడును కోట

౨ అగడితయును బయలద్రియు నీడ
యగు వనమును కల యదియహో కోట

౩ ఔన్నత్యము వెడల్పు నరిదియు దార్ఢ్య
మన్నాల్గు గలగోడ యగునది కోట

౪ సన్నకావలిచే విశాలమై యరుల
పన్నుగడ నడంచు పాటిదే కోట

౫ దుస్సాధమగుచు వస్తువు లన్ని గలిగి
లెస్సగా నిలునం బొల్చినయదె కోట

౬ అన్నివస్తువులుండి యదనున కొదవు
కన్నాకు వీరులం గలయదే కోట

౭ ముట్టి వంచించియుం బోరిప్రిల్చియును
పట్టంగ రానిదే బలమైన కోట

౮ ముట్టడించినవారి ముట్టి పట్టుగను
పట్టనీయక గెల్వ బలమిచ్చుం గోట

౯ మొనమొగమున నరుల్ మొగిసి నశింపం
బని మొగమున బీరపఱచు మేల్ కోట

౧౦ ఎట్టి మేలిమి కలదేని కర్జమున
దిట్ట లేమిని లేనిదియ యగుం గోట.

## ౭౬ విత్తార్జన విధము

౧ వ్యర్థునినేని సమర్థుగాఁ జేయు
నర్థమ్మొకంటె వేఱవనిని గలదె ?

౨ కలవారి నెల్లరు గౌరవించెదరు
కలిమి లేకున్న నగౌరవించెదరు

౩ ధనమను మేల్ దివ్వె తలఁచిన యెడకుఁ
జని పగయను నిరుల్ సమయింగఁ జేయు

౪ పగఁ దేఱి చెడుగాఱి వచ్చిన ధనము
తగవును గూర్చు నిత్యసుఖమ్ముఁ గూర్చు

౫ కరుణతోఁ బ్రియముతోఁ గాని ధనమ్ము
నరసి త్రిశుద్ధిగా నార్జింపఁదగదు

౬ జయశుల్కధనము లస్వామిక ధనము
నయమార్గ నృపుని ధనంబయా నంద్రు

౭ నెనరుచేఁ బొడమిన నెఱజాలి బిడ్డ
ధనమను సౌభాగ్య ధాత్రిచేఁ బెరుఁగు

౮ కలిమి చేతఁగలాఁడు కార్యంబు చేఁత
మలయెక్కి యేన్గుల మాటాట గనుట

౯ ధనము చేర్పఁడు శత్రుతతి కృత్యములను
తునుమఁ దత్సమ శితద్రుణమొండు లేదు

౧౦ ధనము సత్పద్ధతి దండిగఁ గూర్పఁ
దనరారు సుఖువుగా ధర్మంబు ప్రేమ.

## ౨౨ సేవా మహిమము

౧ వెతకు భీతిల్లక విజయమే పొందు
చతురంగసేన మేల్సంపద పతికి

౨ తఱిఁగిన యెడ ఱేఁడు తలరిన యెడను
వెఱవమి యరిది తో ల్వ్యేల్వకుఁగాక

౩ ఏమగుఁ గడలి యుప్పెలుక లార్చినను ?
పాము బుస్సనినంతఁ బాఱవే యెలుకలు?

౪ సడలక లొంగక సరబడి వచ్చు
కడిమి గల్గినదె నిక్కంబగు సేన

౫ జముఁడెత్తివచ్చిన జంకక నిలిచి
సమరంబు తెగి సేయఁ జనునది సేన

౬ కడిమి మానము వీరగతి వర్తిలుటయు
నెడతేటయును సేన కేడుగడ యగు

౭ పై నెత్తిరా నోర్చు పగిదితో శత్రు
సేన నెదిర్చి నిల్చినయదె సేన

౮ కడిమియు దృఢత లేకయు మొగ్గరంపు
వడువుననే మేల్మి వడయును సేన

౯ తఱుఁగు దారిద్ర్యంబు తఱుఁగని విసుగు
పొరయ దేనియు మొన పోరిలో గెలుచు

౧౦ నెఱ మగల్ పలువురు నెఱసి యుండినను
నెఱి నాయకుఁడు లేక నిలువదు సేన.

## ౭౮ శౌర్యపటిమ

౧ ఎదిరించి తుదిఁబల్కు రీల్గిరి ప్రభువు
నెదిరింపకుఁడు బ్రదు కింపగునేని

౨ కానఁ గుండెటిఁ గొట్టు కైదువుకంటె
నేనుఁగుపైఁ జెడు నిషువ్రాన మేలు

3 ఎదిరింప నెదిరించుటే పౌరుషంబు
ఎదిరి క్రుంగిన దయయే దాని వాఁడి

౪ మదకరి వైచి చే మలయు కైదువున
నెద గాఁడినది గని యెలరు శూరుండు

౫ కనలి చూచిన కన్ను కైదువు వైవ
మినికినేనియు నోటమియె మేటికదియు

౬ కడచిన నాళుల గణియించి గాయ
పడని నాళుల లెక్కపఱుపఁడు జోదు

౭ ఘనకీర్తి కనువుల గణియింప కుండు
ఘనునకే భూషయగా గండపెండెరము

౮ దురమున నసుభీతి దొరయనివారు
ధరణిపుఁ డలిగినంతన మాఱుపడరు

౯ చేసిన శపథంబు చెడకుండఁ బోరి
గాసిలి చావఁ దెగడు వార లెవరు?

౧౦ ఏలిక కంటి నీ రెసఁగించు చావు
చాలినఁ దిరిసియు సాధింపఁ దగును.

# మైత్రి పద్ధతి.

## ౭౯ స్నేహము

౧ గడియింపఁ గలదె సంగాతంబుకంటె?
అడరు రక్షక మెద్ది యద్దానికంటె?

౨ విజ్ఞసంగతి బాలవిధుపోలెఁ బెరుఁగు
అజ్ఞుల చెలిమి మున్నడరి వెఱ దఱుఁగు

౩ చదువఁగాఁ జదువఁగా జ్ఞానంబు పోల్కి
నొదవ నొదవ మేల్మి యొప్పు సన్మైత్రి

౪ నగుట కొఱకుఁగాదు నంటు; కీడైనఁ
దెగి మందలించి తఱ దివుచుట కొఱకె

౫ కలియుట యలవాటు కావు హేతువులు
చెలిమికి ముఖ్యంబు చిత్తవృత్తి యగు

౬ అది చెల్మి కాదు మోములరించు చెల్మి
అదియ చెలిమి మనం బలరించు బల్మి

౭ తగనిత్రోవల మాన్చి తగు త్రోవ నడపి
తగమి రాఁ దాఁగొను తగవెపో చెలిమి

౮ ఉడువు జాఱిన వారి కొదవు చేవోలె
నిడుమల నపుడె మాయించును చెలిమి

౯ చెల్లునంత వఱకుఁ జెల్లించు దిటవె
మొల్లంపు నిలుకడ ముఖ్యమైత్రికిని

౧౦ ఇతఁ డిట్టివాఁడు నేనిట్టిఁడ ననుట
హితమైత్రి కేనియు నిదు నొక మనటు.

## ౮౦ స్నేహలక్షణము

౧ హీనుఁ జెలిమిచేసి విడరాదు గాన
దానఁ జేయఁ గూడది వోలె లేదు

౨ అరసి యరసి చేయునట్టి సంగడము
పొరయించుఁ బడపడి పొలియు కష్టముల

౩ గొనము కొలము దొసంగును చుట్టరికము
పొనుఁగువడక కాంచి పొందనౌఁ జెలిమి

౪ కులము మేలిమి నిందకుం జంకు గుణము
గలవాని కిచ్చియుఁ గలియంగఁదగును

౫ తగనివి దుఃఖింపఁ దగఁజెప్పి త్రుంచి
తగవు నడపు మైత్రి తాఁబొందఁదగును

౬ చెడుగువలన నొందు చెలఁగు లాభంబు
కొడిమె చెల్మి పొలంబుఁ గొలుచుకోల యగు

౭ ఒకనికిఁ బెనులాభ మొసఁగు నేదియన
వెకలులతో మైత్రి విడుచుట యంద్రు

౮ క్రుంగించు నవి మదిఁ గొనరాదు వగలఁ
గ్రుంగ వీడెడు చెల్మి కొనఁదగ దెవుడు

౯ చెడువేళఁ జేవీడు చెలిమిని నరుఁడు
మడియుచోఁ దలఁచిన మదిఁ గాల్చివైచు

౧౦ పడయున దలసియోఁ బావన మైత్రి
విడుచున దొకటిచ్చి వికటించు మైత్రి.

౭౧ చనవు

౧ స్వాతంత్ర్యమును బ్రేమపఁజాలని చెలిమి
ఖ్యాతిగాఁ జనవను ఘనతను గాంచు

౨ సంగతి కంగంబు స్వాతంత్ర్య మద్ది
యంగీకరించుట యమలుల తగవు

౩ స్వాతంత్ర్యకృత్య మొప్పక యుండునేని
బ్రాఁత చెల్మికిఁ గల్గు ఫలమేది చెప్పుమ?

౪ మిత్రులు చెప్పక మీఁతె చేసినను
మిత్ర ధర్మముఁ బట్టి మేకొంద్రు బుధులు

౫ పనులు కూడని వంటు పట్టునఁ జేయఁ
జనవో వెడఁగో యంచుఁ జను సమ్మతింప

౬ చెలిమిమేర యెఱుంగు చెలికాఁడు చనవు
వలన మిత్రుదోసంగు వలనఁ జేవిడఁడు

౭ చెలిమి బ్రాఁతపడిన చెలికాండ్రు చెడుగు
కలవి చేసిన పీడఁగాలేరు ఘనులు

౮ చెలికాండ్ర చెడుగులఁ జెవిఁ బెట్టకున్న
సిలుగు చేసిననాఁడె చెలఁగు మేలిమిగ

౯ చెడక బ్రాఁతపడిన చెలికాండ్ర చెలిమి
విడని వారిని చాలఁ బ్రేమించు జగము

౧౦ బ్రాఁత మైత్రికి వేఱుపడని సద్గుణాలఁ
బ్రీతిఁ గొందురు శత్రు వీరులు నెదల.

## ౮౨ చెడు చెలిమి

౧ చెలిమి మిక్కిలి యొప్పుఁ జెనటుల చెలిమి
చెలఁగుట కంటెను క్షీణింప మేలు

౨ కలఁగఁ జేయుచు లేమిఁ గడఁద్రోచు పలువ
చెలిమి చేసిననేమి? చేయక యేమి?

౩ చెలిమి లాభము మేర చింతించువారు
వెలయాండ్ర దొంగల విధము గలారు

౪ తెగఁద్రోఁచి యసిఁద్రోచు తగని గుణ్ణంబు.
వగ చెల్మిఁగొనుకంటెఁ బడయమి మేలు

౫ చేయు సాయము లేని చెనఁటి చెలిమి
చేయుటకంటెను చేయమి లెస్స

౬ అజ్ఞులమైత్రి యత్యధికమా కంటె
విజ్ఞులతోఁ బగ వేపాళ్లు మేలు

౭ ఎగతాళి తిండి యయ్యేడు చెల్మికంటెఁ
బగఱచేఁ బదికోట్ల పాళ్లు మేలబ్బ

౮ అవు పని కానీక యడఁగార్చు చెనఁటి
తవులు చెప్పక దోర్చు తగవెపో లెస్స

౯ పలుకు చేఁతలు వేఱుపడు వారి చెలిమి
కలనైనఁ గలిగినఁ గావించుఁ జెడుగు

౧౦ సదనాన స్నేహించి సభను నిందించు
పిదప చెల్మి తగదు పీసమంతేని.

## ౮౩ తగని చెలిమి

౧ మనసున లేక పై మలసిన చెలిమి
తను నలఁచుట కది దాకలి యగును

౨ చెలిమిఁగలట్టుండి చేరని చెలిమి
చెలువల మదివోలెఁ జెలఁగి భేదిల్లు

౩ మంచివి పలునేర్చి మనసుతోఁ జెలిమి
పెంచుట యదిలేదు వెడఁగుల యెడల

౪ కనినప్పు మొగముతోఁ గలకల నవ్వి
మనసున రోయు వెంబర కంజఁ దగును

౫ మనసున నొంటని మనుజు లేదేని
వినిపింప మేకొంట వెరవు గాదంద్రు

౬ తగవరిపోలె హితము లాడఁ బూనఁ
బగఱ పల్కు లపుడె పరికింపఁ దెలియు

౭ చెడు వెంటకే యగుఁ జెలఁగు విల్వంక
చెడుగునకే యగుఁ జెనఁటుల నయము

౮ అరుల కై మోడ్పులయం దశ్రులందు
నరయ దాఁగియుండు నాయుధ మొందు

౯ పెల్లుగ స్నేహించి వెనుకఁ గ్రేడించు
కల్లరి నవ్వించి కడఁ ద్రోవఁ దగును

౧౦ పగవారు స్నేహించు పగిది యేర్పడిన
మొగముతోఁ జేసి లో మొనసి వీడఁదగు.

# దుఃఖపద్ధతి.

## ౭౪ వెడఁగు

౧ వెడఁగన నేది వివేచించి చూడఁ
జెడుగులఁ గొని మేలు చిదియ పీఁకుటయె

౨ వెడఁగులలోపల వెడఁగేది యన్న
నెడఁద గొంతెమకోర్కు లిచ్చగించుటలు

౩ అరయిక సిగ్గు ప్రియంబును శ్రద్ధ
వెరవు లేకుండుట వీఱిఁడి తీరు

౪ చదివి వివేచించి చదురాడి యట్లు
పొదలని జనుకంటె మూఢులు లేరు

౫ ఏడుజన్మంబుల నెద్దియు నారకము
ప్రోడవై యొక్క బాముసఁ గూర్చు వెడఁగు

౬ పని యొండు పూనఁగా వగలేని వెడఁగు
పని చెఱచుటె కాదు బంధముల్ గొనును

౭ పెనుకల్మి గలిగిన వెంగలి కొకటఁ
దనవారు గొదగొనఁ దరియింత్రు పెరలు

౮ తనచేత నొకకాసు తనరిన వెడఁగు
కనఁగ నున్మత్తుండు కల్లుద్రావు కరణి

౯ విడునప్పు డగు నొక్క పీడయు లేదు
వెడఁగులతో మైత్రి వెడఁగుల కింపు

౧౦ వెడఁగు తాఁజొచ్చుట విజ్ఞులసభను
కడుగని కాల్పడకను పెట్టు వలను.

## రాగె అల్పజ్ఞత

౧ లేముల లేమి ధీలేమి తక్కినవి
లేమిని లోకంబు లేమిగాఁ గొనదు

౨ వెడఁగు మనసు వచ్చి పెరవాని కీవి
పడయు నాతని తపః ఫలమగు నిజము

౩ అరులును గలిగింప నరుదగు వెతలు
పొరయించుకొందురు మూర్ఖులు జగతి

౪ అజ్ఞానమన నేదియన మేము గొప్ప
సుజ్ఞానుల మటంచుఁ జొక్కెడు భ్రాంతి

౫ నేరక పైకొని నెగడిన, మున్ను
నేరిచినది గూడ నెఱయించు శంక

౬ తమ దోసంగుల నీఁగఁ దలఁపక యంగ
కముల సంగముఁ గప్పఁ గడఁగుట వెడఁగు

౭ అరిది విద్దియ జార్చు నంతియ కాదు
పొరయించుకొను మూర్ఖు పాలి వాని వెతల

౮ తెలిపినఁ జేయఁడు తెలిసియుఁ గొనఁడు
అలయొడ్డె మరణాంత మవనికి నొవ్వి

౯ కానని వాఁడు తాఁ గాన్పించుఁ గనఁడు
కానకుండిన వాఁడు కాంచుఁ గన్నంత

౧౦ కలదన్న దానిని కల్లయనె వాని
నిలఁ బిశాచంబుగా నెంచును జనము.

## ౮౬ పగ

౧ అన్ని ప్రాణులతోడ నలరని గుణము
వన్నె యడరు నొవ్వఁ బగయండ్రు బుధులు

౨ వేఱెమిఁ దలపోసి వెగటు చేసినను
వైరంబుతోఁ గీడు పఱుపమి లెన్న

3 పగయను చదునొవ్వ పాసినవాని
కగును నిత్యమ్మయి యలరు పొగడ్త

౪ చెడుగులఁ జెడు గీను చెలఁగకున్నని
వడయు సౌఖ్యముల లోపల మేటి సుఖము

౫ పగయున్న నొ[illegible]గీడు వ[illegible]లు మేటి
దాఁగి [illegible] నవ్వరు గలరు?

౬ [illegible] లవారి [illegible]దిమి
[illegible] లక్ష్ము గతిని

౭ [illegible] సచ్చరించు [illegible]లు [illegible]యంబు
[illegible] ధనంబును గాంచలేరు

౮ పగ[illegible] [illegible]ష్ఠమి పడయు నున్నతిని
ఎగడి ప్రాసిన నబ్బు సిరులు మిగిలి

౯ తనకు నయము వచ్చుతఱిఁ బగఁ గనఁడు
అనయుంబు వచ్చుచో నధికంబు గాంచు

౧౦ కంటుచేఁ గీడులు గలుగు నన్నియును
నంటుచే నగు మంచి నయము లన్నియును.

## ౮౭ పగమహిమ

౧ వలదు దండము బలవంతునితోడ
వలసిన లోఁగని బడుగుతోఁ దగును

౨ స్వహిత సామంతాది బలములు లేక
అహితుల నడఁచి జయంబెట్లు గొనుట?

౩ తెగువయుఁ దెలివి పొందిక లేని లోభి
పగఱకు మిక్కిలి పాటి సులభుఁడు

౪ అతికోపియై మంత్ర మరయక యుండు
పతి యెప్పుడే నేరికేని లోకువయ

౫ నియత పథము జననింద కార్యంబు
నయ మెఱుఁగని వాఁడు నంటు మార్తురకు

౬ ఎఱుఁగని కోపంబు నెదుఁగు కామంబు
పొరయువాని పగ నెప్పుడు నెంత్రు పగఱు

౭ తనపనికే విరుద్ధము సేయు పతికి
ధన మిచ్చియును విరోధముఁ గొనవచ్చు

౮ గుణహీనుఁడయి చెడుగులు పెక్కులున్నఁ
దనకుఁ దోడది కాదు దాయల తోడు

౯ భయము నజ్ఞానంబు పగఱ కున్నేని
జయలక్ష్మి తమకు సిచ్చలు చేరువగును

౧౦ అల్పుని పగచేత నడరు ధనమ్ము
అల్పమైనఁ గొనమి నడరదు యశము.

## ౭౭ పరస్వభావ మెఱుఁగుట

౧ పరిహాసమునకేని పగయును గుణము
పరికింపఁ దగమియే ప్రాజ్ఞుల మతము

౨ విలువృత్తి గల పగ వినిఁ గొనవచ్చుఁ
బలుకువృత్తి గలారి పగ గొనఁదగదు

3 పలువురతోడను పగగొను నొంటి
తలఁప వేఁదుఱుకంటెఁ దగఁ గీడువాఁడు

౪ అదన వేరమని స్నేహమ్ముగాఁ గొనుచుఁ
బొదలు తేని కడంగి భువనంబు నడచు

౫ అగుతోడు లేనితేఁ డదను నెఱింగి
పగ చీల సందొండు పడయుంగఁ దగును

౬ తన కొక్క యిడుమ యరాతటిఁ బరన్నృపులఁ
గొనియుఁ గొనక కూడి కూడమి తగును

౭ నొచ్చిన దొరులకు నొడువంగఁ దగదు
పొచ్చెంబు పగఱకు మును చూపఁ దగదు

౮ తగవార సేనయు ద్రవ్యంబుఁ బెంపఁ
బగఱ కఱకు త్రుళ్లు పాలడఁగాఱు

౯ ఎలవేళ ముండ్ల చెట్టడలింపఁ దగును
చెలఁగు పిదపఁ దన చేతిని చెఱచు

౧౦ అరిపీకు తొల్తనే యడు గార్పకున్నఁ
దిరిగి యూర్పుటకును తెఱఁకువ కాదు.

ఠా లో ప ౫

౧ నీడనీగము కీడు నించు నోర్వితటి
కీడు దాయ లోన త్రుప్తి కీడగు వేళ

౨ అంజఁదగదు అంపమైన శత్రులకు
అంజఁదగును చుట్టాలైన శత్రులకు

౩ ఎడపగ కంజి త న్నేదుకోకున్న
మడియించు నదనఁ గుమ్మరికైదు వట్లు

౪ పగలోనఁ గలిగిన బందుగుల్ గూడ
పగవార లగుదురు పలుపాట్లు గలుగు

౫ కలిసియుండియు నెదఁ గంటున్న యెడలఁ
బొలియించు పెనుకష్టములు గలిగించు

౬ కలిసియుండెడి యెదఁ గరకరి గలుగఁ
బొలియకుండు టరిది భువి నెన్నఁడేని

౭ పలుకులఁ గలిసి లోపగ యున్నవారు
గలియరు గిన్నెకుఁగల మూఁత వోలె

౮ చెఱచు లోపగ గల్గఁ జిట్టాకుఱాత
నఱుగు బంగార మట్లఱుగుచు లంబి

౯ ఆవ పప్పంతైన నాద మచ్చరము
భావింపఁ జెఱుగు గొప్పదిగఁ బుట్టించు

౧౦ ఒడఁబాటు లేనట్టి యొకనితోఁ బ్రదుకు
గుడిసెలోఁ ద్రాఁచుతోఁ గూడియుండుటలు.

## ౮౦ పెద్దల నగౌరవింపుము

౧ పట్టు విడనివారి పనులాలి గొనము
నెట్టన రక్షల నెఱి మేటి రక్ష

౨ పెద్దలఁ దా గారవింపనియెడలఁ
దద్దయు నబ్బు వెద్దవిలి పెన్వాతలు

౩ తలఁపు నెఱపుకొను తత బలాఢ్యులకు
సిలుగులు కూర్చుఁడు చెడఁ గోరునెడల

౪ చతురుల కచతురుల్ సలుపుట కీడు
పితృపతిఁ జేయెత్తి పిలుచుటఁబోలు

౫ నెఱ కడిమి గల మన్నీని యీరసకు
గుఱి యగువా రెందుఁ గొఱలంగ లేరు

౬ నిప్పున దుమికియు నెగడఁగలారు
ముప్పు ఘనులకెంచి పొదలంగ లేరు

౭ తగవు గల్గినఘనుల్ తద్దయుఁ గినియఁ
దెగు దొరతనమును తెఱఁగైన కలిమి

౮ కొండవంటి ఘనులు కోపింపఁ గూలు
నిండు సంపదగల నెఱ కుటుంబములు

౯ ఘనకార్యముల సిద్ధిగలవారు కినియఁ
దునిఁగి నడుమఁజెడుఁ దూలి యింద్రుఁడును

౧౦ అధిక తపోమహిమాఢ్యులు కినియ
నధిక సహాయకులైన వర్ధిలరు.

## ౯౧ ఆఁడువాండ్రకు లోఁగుట

౧ మగువకు లోఁగిన మహిమ చేకుఱదు
తగులరా నెటకేఁ గార్యదక్షు లెన్నఁడును

౨ అరయక యాలిప్రియముఁ గోరువాని
సిరి మగవారికే సిగ్గుఁ గల్గించు

౩ ఆలికి నణఁగు కార్యము ఘనులందు
చాలఁగా బిడియంబు సమకూర్చు నెపుడు

౪ తరుణి కడలి సుకృతము సేయలేని
పురుషుని పనినేర్పు పొగడంగఁ బడదు

౫ ఆలికి నడుఁకు వాఁ డన్ని వేళలను
మేలు సేయఁగ జంకు మేలువారలకు

౬ యువతీ శరీర భావాల కంజువారు
దివిజాభులైనఁ గీర్తిని గాంచలేరు

౭ మడఁతి యాజ్ఞ నడచు మగఁటిమి కంటె
బిడియంపు స్త్రీత్వమే వేపాళ్లు గొప్ప

౮ ముదిత యాజ్ఞ నడచు పురుషుండు మిత్రు
కోద దీర్పలేఁడు మేల్గూర్పను లేఁడు

౯ నర్మసఖికి లోఁగు నరుకడ లేవు
ధర్మంబు నర్థంబుఁ దదితరంబులును

౧౦ అరయు నెడఁద దిట వగువారియెడల
దొరయ దాలికి లోఁగు దొడ్డ వెడంగు.

౯౨ వెలయాండ్రు

౧ చెలిమిచే గోరక సిరిచేతం గోరు
వెలయాండ్ర ప్రియవాక్కు వెత గలిగించు

౨ గుణములు ఫలముకై కొనియాడునట్టి
గుణహీనల నెక్కింగి కోరంగ దగదు

౩ వెలయాండ్రం దడవుట పెను చీకటింటం
దలిరిచి పీనుగుం దడవుటం బోలు

౪ ధనముసే కోరు కాంతల యల్ప సుఖము
నెనరు ధనము గోరు నియతులు గొనరు

౫ ఎదమేల్మిగల జ్ఞాను లిల వెలయాండ్ర
కొద సుకంబుల కిచ్చగొన రెన్నడేని

౬ తమి రేచి కొంటసోము దవిలించు చెలుల
నమలకీర్తులు గొన రాలింగనంబు

౭ ఎదవేఱ యుండి పైకిచ్ఛించు చెలుల
ముదమునం గౌగిలింపుదు రల్ప మతులు

౮ కపటాత్మల మనంబుం గనని యజ్ఞులకుం
జపల మోహిని వెల జలజాక్షియండ్రు

౯ వారకాంతా మృదు బాహువుల్ లోతు
రౌరవ మగును ధారుణి వెంబరలకు

౧౦ ఈరెదగల వెలయింతులు, పణము,
వారుణి, సిరి ద్రోచువారి కిష్టములు.

## ౯3 కలుద్రావమి

౧ త్రాగు డాసించు వారలు శత్రు భయద
యోగంబు తేజంబు నొందఁగాలేరు

౨ త్రాగఁ దగదు కల్లు త్రాగఁ గోరినను
త్రాగుఁడు ఘన గణ్యతను గోరరేని

౩ తల్లికిఁ గూడ ద్రోఁతను గూర్చుచుండు
కల్లు ఘనులయెడఁ గలిగించు నేది?

౪ కల్లను నింద్యమా కడు దొసఁగున్న
యెల్లరకును సిగ్గుటెంతి వెన్నిచ్చు

౫ వెలయిచ్చి కల్లుద్రావి వివశత గొనుట
కలుగు చేఁతల పాటు గానమి నగును

౬ మృతుఁడు నిద్రితుఁ డించుమించు సమాన
గతు లట్లు విసమును కల్లుద్రావువారు

౭ త్రావి మైమఱచుచోఁ దనవా రెఱుంగ
వాఖిరి నవ్వుల పాలగు వాఁడు

౮ కల్లుద్రావి మఱవమఁ గఱద వీడఁదగు
వెలలుచు నది యెద వీడని మఱుఁగు

౯ సాలపరికి గతంబు చొప్పు చూపుటలు
జల మధ్యగతు దివ్వెఁ జాఁచి చూపుటలు

౧౦ త్రాగని వేళలోఁ ద్రాగుఁబోతుఁ గని
త్రాగుట నగుకీడు తలఁపలేఁ డొక్కొ?

## ౯౪ జూదము

౧ జయశీలుఁడేని జూజముఁ గోరఁ దగదు
జయపణంబును బడిశము చేఁప వితము

౨ ఒకటి గెలిచి నూఱు లోడు జూదరులు
సుక మొంద నడచెడు చొప్పును గలదె?

౩ అడ్డసాళ్ల నుతించి యాడెడువాని
గడ్డుకలిమి వేఱుకడఁ జేరుఁ దొలఁగి

౪ బన్నమ్ములిడి చిన్న పఱుచు నెత్తమ్ము
కన్న నెద్దడిఁ గూర్పఁగల దొండు లేదు

౫ సారెలు పలకయు సభయును విడని
వారలే యుండి లేవడు లైనవారు

౬ కడగండ్లఁ గంద్రు సుఖంబులఁ గనరు
పడి నెత్త పెద్దమ్మ పాలైన వారు

౭ పనుపడు గుణము సంపదయును చెడును
తనకాలమెల్ల జూదమ్మునఁ గడప

౮ ధనము నాశముచేసి దబ్బఱ నెఱపి
నెనరు మానిచి కుదుప్పు నెవ్వలఁ బణము

౯ ధనము తేజము విద్య తగు తిండి యుడుపు
లను నైదు తనుచేర వాడ నెత్తమ్ము

౧౦ చెడు కొద్ది వలపు హెచ్చెడి జూదమందు
పడు కొద్ది జీవికి వలపు మేని పయి.

## ౯౫ మందు

౧ మొదలి కారణములో మూఁడు ప్రకృతులు
పొదలిన దగ్గినఁ బొడము రోగములు

౨ తిన్నది యఱుఁగుట తెలిసి భుజింప
నెన్నఁగా నొడలికి నేల యౌషధము ?

3 అఱిగిన పరిమితి నరసి తినునది
చిరకాలము మనెడి జీవి దారియది

౪ అఱిగిన దెఱిఁగి పేరాఁకలి గొనఁగ
నఱుగని వెఱిఁగి తానగు భుజియింప

౫ తగియుండు తిండి మితముగ భుజింప
నగు రోగదుఃఖంబు లరయంగ లేవు

౬ మితి యొఱింగిన సోమరి మితిమీఱునట్లు
మితిమీఱ నొవ్వియు మితిమీఱుచుండు

౭ కడుపుచిచ్చు కొలఁది గానక మీఱి
కుడువ రోగమ్ములుఁ గొలఁదికి మీఱు

౮ గదము నిదానంబు గాంచి తొలంగు
పదురు నెఱిఁగి చేయవలయుఁ జికిత్స

౯ గదగు కొలంది రోగము కొలందియును
అదను నెఱిఁగి చేయనగుఁ గ్రియ వెజ్జు

౧౦ గదగుఁడు వెజ్జూడిగము మందు నాల్గుఁ
గదిసిన పద్ధతి కడుమేల్ చికిత్స.

# ప్రజాపద్ధతి.

## కులీనత

౧ అడకువ నానయు నార్జవ మవని
నడరుఁ గులీనుల కది సహజముగ

౨ నడవడి సత్యంబు నానయుఁ మూఁటి
నెడయ రుత్తమవంశ మొనసినవారు

౩ తగు కులీనులకు సంతసము దానంబు
తెగడమి ప్రియవాక్కు తెరువు లీనాల్గు

౪ వెలయఁ గులీనులు వేకోట్ల ధనము
గలిగినఁ జెడుపనుల్ గావింపఁబోరు

౫ వరవ తగ్గిన ఘనవంశజుల్ క్రుంగి
యురుగుణంబుల సుంతయును మాఱుపడరు

౬ విమలకులాచార విధి విచారకులు
బ్రమయించి కానికార్యము లొనరుపరు

౭ ఒప్పారుకులము వాని కొకదోసఁగున్న
గొప్పగా నెలమచ్చ కొమరునఁ దోఁచు

౮ కడు కులీనుని కడఁ గటువున్న వాని
పొడమికలో శంక పొందంగఁదగును

౯ మొలకలు తెలుపును పుడమి శీలంబు
పలుకులు తెలుపును వంశ శీలంబు

౧౦ వలయు నెడ శుభంబు వలయు బిడెంబు
వలయు నెడఁ గులంబు వలయు నయంబు.

## ౯౭ మానము.

౧ తెలుఁగని గరువంబు తనరినయేని
తెలుఁగగు చెడుపనుల్ తాఁజేయఁ దగదు

౨ ఖ్యాతితో మానంబు నాసించువారు
ప్రీతికై యొప్పని విధు లొనరుపరు

౩ అడఁకువ ధనము గలప్పుడు వలయు
నడఁగమి చిఱులేమియందును వలయు

౪ కులజులు తమ కులగురుతఁ గోల్పడిన
తలవీడు కురులట్లు తలఁపఁబడుదురు

౫ క్రుంగు కార్యముసేయ గురిగింజయంత
క్రుంగుదురు నిజంబు కొండ పోల్వారు

౬ తెగడువారల వెంటఁ దిరుగ యశంబు
నెగడదు దివి లేదు నిగుడు నింకెద్ది?

౭ చెడువారి వెన్నాడి జీవించుకంటెఁ
జెడెనంటమేల్ తొలి స్థితియందెయుండి

౮ కులము మానము గూడఁ గ్రుంగుచో నొడలి
నిలుపుకొనుట చావు నీఁగు మందగునె?

౯ జడ నీఁగ బ్రదుకని చమరంబు వోలె
విడఁదగుఁ బ్రాణంబు విడక మానంబు

౧౦ పొచ్చెంబు రాఁ బ్రాణములు వీడు ఘనుల
హెచ్చు కీర్తిని లోకు లెత్తి నుతింతురు.

## ౯౮ గౌరవము

౧ హృదయోన్నతియె కీర్తి హేతు వొక్కనికి
నదిమాని జీవింత మనుట హైన్యంబు

౨ జనన స్వభావంబు సమ మెల్లరకును
పనులు వెవ్వేఱౌట ఫలములు వేఱు

౩ అల్పు లున్నతి నున్న నధికులు కారు
అల్పపదవి నున్న నధికులే ఘనులు

౪ తగు సతులంబోలెఁ దము గాచి కొనఁగఁ
దగు వార లై రేని తనరు గౌరవము

౫ గౌరవంబు గలారు కడిఁది కార్యముల
తీరు లెఱిఁగి చేసి తీర్పంగలారు

౬ ఘనుల మన్నింతమఱి కడఁకతోఁ దలఁపు
మనసున లేదల్ప మతుల కెన్నఁడును

౭ గౌరవం బల్పు లొక్కట నొంద మదము
మీఱిన చేఁతలు మిక్కిలి గలుగు

౮ పొంకంబుతో నయముంబొందు గురుత
బింకంబుతోఁ దన్ను వినుతించు లఘుత

౯ ఘనత గర్వంబును గననిది యలఁతి
తన మహాంకృతి నుచ్చదశ నొందియుండు

౧౦ అవమతి మఱువుచ్చి యలరును గురుత
తెవడి దొసంగులే తెల్పును లఘుత.

## ౯౯ గుణ సమృద్ధి.

౧ నిందుమతిని విధుల్ నెఱవేర్చు నెవఁడు
దండి గుణంబు లాతనికి నైజములు

౨ గుణము మేల్మియె వివేకుల మేల్మి తక్క
గణుతిఁ గొనవు రూప గరిమాదికములు

౩ ప్రియము హ్రీసత్యోపకృతులు మోమోట
యయిదు మహిమ మోయునట్టి కంబములు

౪ ఒరుల హింసింపంగ నొల్లదు తపము
పరుల దోసఁగులెత్తి పలుకదు మహిమ

౫ అడఁగి సాధించుఁ గార్యజ్ఞుల నేర్పు
అడరు సాధన మదే యరుల నడంప

౬ ఘనత వన్నియ కొరగ ల్లసమాన
జనుల పట్టున నోటు సమ్మతించుటయె

౭ ఒప్పమి సేయు నొప్పొనరింపకున్న
గొప్పతనంబేమి గుణము నొందినది ?

౮ గొనముల నెఱవు నెక్కొనునేని పేద
తన మపహాస్య పాత్రము గాదు తనకు

౯ అల గుణాబ్ధికి మేరలై నిల్చువారు
ప్రళయాబ్ధి పొంగినఁ బల్లట పడరు

౧౦ గుణ సమృద్ధి గలారు గుణములఁ గ్రుంగ
మునుఁగు భూమి బరువు మోవంగ లేక.

## ౧౦౦ నడవడి కలిమి.

౧ సులభుఁడై చూడంగ శోభిల్లు నరుఁడు
సులభంబు భువిలోన సుశ్లోకుఁడగుట

౨ అనుకంప సత్కులమందు పుట్టుకయు
నను రెండు సత్కీర్తి నందు దారులగు

౩ ఒడలితో నొంటుట యొప్పదు తగిన
నడతతో నొంటుట నరులకు నయము

౪ నయఫలమందు జనము నడవడిని
జయవెట్టి ఘోషించు జగము సతమ్ము

౫ నగవునకేని నిందన తగదండ్రు
పగయేని గుణులతో ఫలమే యొసంగు

౬ గుణవంతు లుంటచేఁ గొమరారు జగము
మణఁగి మంటఁ గలిసి మాయు లేకున్న

౭ గుణహీను లాకుఱా కొమరైన తెలివి
నెనసి యుండియు (మాని కెనయైనవారు

౮ నెనరులే కరు లవినీతి చేసినను
తన గుణములనుండి తప్పుట కీడు

౯ కలిసి ముదంబందు కఱద లేదేని
బలియు నిరులు పట్టు పగలె విశ్వమున

౧౦ నడవడిలేని యా నరు పెను కలిమి
కడవ కీడునఁ జెడ్డ గల పాలఁబోలు.

## ౧౦౧ ఫలహీన సంపద.

౧ కడుఁగూర్చి ధనము భోగము నొందఁ డేని
మిడికిననేమి ? తా మృతినొందనేమి ?

౨ ధనముచే నెల్లఁ గాఁదగునని యాశ
పెనులోభి యగునేని వెకలియై పుట్టు

౩ గడనయే ముఖ్యంబుగా నెంచి కీర్తిఁ
దడవని జన్మంబు ధరణికి బరువు

౪ ఒకని కేనియు నంత యొదవని లోభి
యకట ! నిల్చున దేదియని యెంచునొక్కొ ?

౫ తినక పెట్టకయుండు దేబెకు ధనము
పెనువేల కోట్లున్నఁ బేదయే యతఁడు

౬ దాన భోగములు పొందని గుణంబున్నఁ
దానొక రోగమౌఁ దన ధనంబునకు

౭ పేదల కొండీని పెనులోభి ధనము
పాడు కన్నియ ముదుసలి యౌటఁబోలు

౮ పిసినిగొట్టు కలిమి పెన్మారి నడుమ
ముసిఁడి నిండుగఁబండి మొనరుటఁబోలు

౯ తను మాడ్చికొని దయా ధర్మముల్లేక
నినిచిన కల్మిఁ బొందెడివారు పరులు

౧౦ గురు యశోధనికుని కొఱవడు సీవి
విరిసి కురియు మొగుల్ వెలియుటఁ బోలు.

## ౧౦౨ సిగ్గరిమి.

౧ చెడు కార్యముల నగు సిగ్గె సిగ్గంద్రు
మడఁతుల కగు సిగ్గు మఱి నైజమంద్రు

౨ అందఱ కన్న వస్త్రాదులు సమము
యందు సిగ్గిలుట మహాత్ముల మేల్మి

౩ నెలవగు నొడలు ప్రాణి వితతికెల్ల
నెలవగు బిడియంబు నెఱతనంబునకు

౪ నానయే తొడవగు నయగుణాఢ్యులకు
నానలేని మదంపు నడక రోగంబు

౫ పరనిందఁ దన నిందవలె నెంచువాని
పరులు నుతింత్రు నానకు నెలవనుచు

౬ ఘనులు సిగ్గును రక్షగాఁ గొనకుండఁ
బెను జగంబును గొనఁ బ్రియపడరెపుడు

౭ సిగ్గుకై విడుతురు జీవముల్ ఘనులు
సిగ్గు వీడఁగలేరు జీవముల్గావ

౮ పరులు సిగ్గిలు దానఁ బడఁడేని సిగ్గు
నెఱియె త్రోవఁగఁదగ్గ నీచతనొందు

౯ నడవడి చెడిన నన్వయమును కాల్చు
బిడియంబు చెడ మేల్మి పెనుపును కాల్చు

౧౦ నాన యెదను లేని నడవడి బొమ్మ
ప్రాణినా సూత్రమై భ్రమయుటఁబోలు.

## ౧౦౩ కుటుంబ భరణము

౧ పన్నినపని చేయి వదలనన్ పేర్మి
కన్న మేలిమి వేఱు కలదె యొక్కనికి?

౨ కడఁకయు నెఱ తెల్వి గలిగి కార్యముల
నెడపడ కొనరింప నెసఁగు సంస్కృతియు

౩ అడర సంస్కృతి పూను నతనికి విధియు
నడుము కట్టుకొని మున్నడి వచ్చి నిలుచు

౪ తన లంబి పనులను తలరక పూన
నొనఁగూడు ఘనత దా యోజింపకున్న

౫ కలుచు లేక కుటుంబకంబు వర్ధిల్ల
వలచువాని జగంబు బలసి వర్తిల్లు

౬ జనియించు కులము ప్రశస్తికి నెక్కు
గొనము లల్వాడఁ గొంట గొప్పరక్షకము

౭ కలన శూరుని పోలెఁ గడఁగి కొలంబు
వెలయించు నెఱజాణ పెక్కండ్ర నొకఁడు

౮ కులమేలు వాని కొంకొండు లేదదను
అలసుఁడై మానంబు నాసింపఁ జెడును

౯ లంబి తాపములఁ దొలంపఁ గడంగఁ
బంబు కీడుల కొడల్ పాత్ర మానొక్కొ?

౧౦ భుజమిచ్చు మోపరి పుట్టని లంబి
కుజము విపత్తను గొడ్డలి నఱకు.

## ౧౦౪ సేద్యము

౧ ఏరు వెన్కాదె జగం బెట్లుచుట్టినను
మీఱి కష్టించిన మేల్ వృత్తి కృషియు

౨ కృషిలేని వారి భరించెడు కతనఁ
గృషికులే యాధార మీ జగంబునకు

౩ మడకచే మనువారె మనువార లితరు
లడఁగి సేవించువా రన్నంబు కొఱకు

౪ మడక నీడఁగలారు మహిఁ గాంతురు తమ
గొడుగు క్రిందనె పెక్కు గొడుగుల నీడ

౫ కోర లేదనకిత్తుర్ కోరంగఁ బోరు
పైరిడి భుజియించు వ్రకృతి గలారు

౬ కాఁపు చేముడిఁగినఁ గలుగదు తిండి
తాపసులకు లేదు తగు నిల్వారంబు

౭ తెగు దుక్కి రొయికటఁ బూర్తిగ నెండి మగ్గు
టగునే నెరువు కోర కధికంబు పండు

౮ దున్నుట కంటె సత్తువ మేలు నీటి
కన్నఁ గలుపు దీసి కాచుట మేలు

౯ ఇలుతేఁడు పొలము తట్టేగఁడయేని
అలిగి విడుచుఁ బొలం బాలి కైవడినిఁ

౧౦ అలసులై దీనుల మని యుండు వారిఁ
దిలకించి పొలమును తెలి గంటి నవ్వుఁ.

## ౧౦౫ పేదఱికము

౧ నెవ్వకైవడి నింపు నీఁగున దేది?
నెవ్వలో నెవ్వఁగ నెవ్వయే చుమ్ము

౨ ఈపుట్టు మఱుపుట్టు వెనసెడి సుఖము
త్రోపాడి లేమి యఱ దోష మేతెంచు

౩ ప్రియవాక్కులను చుట్టఱికపుఁ బ్రేమమ్ము
దయలేక తొలఁచుఁ బేదఱిమి యఱ దొసఁగు

౪ కులజాల యొషనేని కొఱవెట్టి విసుగు
కలఁచు నీచోక్తులఁ గలిగించు లేమి

౫ ఎద్దడి యను కష్ట మేతెంచు నంతఁ
దొడ్డవౌ గుణములు దొసఁగులు చేరు

౬ మీఁదు తెలిపి చాల మేలు చెప్పినను
పేదల మాటలు పెదవుల చేటు

౭ ఘనత చేరదు లేమి కలఁచిన వాని
గనిన తల్లియు వైరి కరణిని గాంచు

౮ నిన్న మృత్యువు పోలె నెగడిన లేమి
నన్ను చంపన నేఁడు నడతెంచునొక్కొ?

౯ నిదురింపవచ్చును నిప్పులోనైన
నిదుర లే దెద్దడి నిండ నెవ్వరికి

౧౦ పొంద సంపద లేక పూర్తి విరక్తి
పొందమి గంజి కుప్పునకును చేటు.

## ౧౦౬ యాచన

౧ యాచింపఁదగువారి యాచింపఁదగును
దాఁచ ధార్మికుతప్పు తమ తప్పుగాదు

౨ యాచించునది తన కలయిక దొరక
యాచనమును సొంపెయగు యాచకునకు

౩ దాఁచుట యెఱుఁగని ధార్మికులకడ
యాచించుటయు నొక యరుదైన సొగసె

౪ దాఁచుట కలనైనఁ దలఁపనివారి
యాచించుటయు నీవియందంబుఁబోలు

౫ యాచకుల్ కనఁబడునంతఁ బైకొనుట
దాఁచకిచ్చెడువారు ధరనుంటఁజేసి

౬ లేదన కిడుమఁ దోలినవారిఁ గాంచఁ
బేదల యిడుమలు వెంటనే తొలఁగు

౭ అవమతి నిందసేయని దాతఁ గనిన
సొవసి లోలో మది చొక్కి యుప్పొంగు

౮ ఇయ్యఁగ వేఁడువా రెవయని జగము
కొయ్య బొమ్మల యాట కొఱలినట్లుండు

౯ అడిగి కైకొనువార లమరర యేని
ఇడెడువారికిఁ గీర్తి యేరీతిఁ గలుగు?

౧౦ లేదన్నఁ గోపంబు లేకుండఁ దగును
లేదన్న నొవ్వి చాలినసాక్షి తనకు

## ౧౦౭ వేఁడికోలు తెఱవు

౧ దాఁచ కలరి యిచ్చు దాతలకడను
యాచింపమియె కోటియంతలు లెస్స

౨ కష్టయాచ్ఞను బ్రదుకఁగఁ గోరనేని
స్రష్ట శ్రమించుచు సమయును గాక

౩ యాచించి యెద్దడి నాఁపుద మనుచు
లేచు మూర్ఖతకంటె లేఁదొక్క వెడఁగు

౪ నీదరమయ్యు యాచింపని దృఢత
మేదిని మోవంగ మీఱిన గురుత

౫ కష్టింప నగు పేదకలిఁ ద్రావుకంటె
సిష్టమైనది వేఱె యిలయందు లేదు

౬ పసికి నీరైనను పశు వేఁడుకంటె
రసనకు హైన్య మరయ వేఱు లేదు

౭ యాచింప లేకను సజ్జులఁ జేరి
యాచింపవలదని యాచించువాఁడ

౮ యాచన యను రక్ష యడరని పడవ
దాఁచుట యనుబండఁ దగిలినఁ బగులు

౯ యాచనఁ దలఁప నీరయి స్రుక్కు మనసు
దాఁచుటఁ దలపంగఁ దాఱి నాశిల్లు

౧౦ అడిగి లేదన నుసు అరుగుచునుండఁ
గడఁగి లేదనువాని కపుడెట నున్నో?

## ౧౦౮ నీ చ త్వ ము

౧ పురుషునే యల్పుండు పోలు వాఁడతని
కురవైన యుపమ వేఱొండు గన్పడదు

౨ అలుపు లెదను చింత యరయరు గాన
నిల నుత్తములకంటె హెచ్చుగా దృఢులు

3 వలపు వలచినట్లు వర్తించుచుంట
నలుపులు వేల్పుల యందంబువారు

౪ అలుపులు శీలుల నరసిర యేని
వలచి నటింతురు వారికి మించి

౫ అలుపులు శీలంబు నందరయేని
అలుకో కోర్కెయి యేదొాయెయుండు నెదను

౬ వినిన దొారుల కష్టె వినిపించుకతన
నెనయంద్రు తుదుమున కిల నీచజనులు

౭ ముక్కడుల్ దౌడల మోఁదువారలకుఁ
దక్క నెఁగిలిచేయి తడి విదురుపరు

౮ వలచిన నొాదవును ప్రాజ్ఞవరుండు
నలఁచిన నొాదవుఁ జెన్నఁటి యించువోలె

౯ ఊడుపుఁ గుడుపు మేల్మి నొాగిఁ గాంచెనేని
యొడిసి తప్పులు వట్టనోపు ఖలుండు

౧౦ దొానగురా నమ్ముకొందురు తమ్ము ఖలులు
ఎనకంబుతో మఱెయ్యది చేయఁగలరు?

# 3. కామ కాండము

## ౧౦౯ రూపతాపము

౧ నెమలియో? వేల్పుకన్నెయో? నేలచెలియో?
భ్రమసె నామది గాంచి పైఁడి కుండలను

౨ చూడ నెదురుచూచు సుందరి చూపు
దాడిగా మోహిని తాఁకినట్లుండె

౩ మృత్యువు మునుచూడ నిపు డెఱింగితిని
సత్యంబు సుందరి సమరనేత్ర యది

౪ కనువారి జీవముల్ కనుచూపుతోనె
కొనుపోల్కి నున్నవా కొమిరెకుఁ గనులు

౫ మృత్యువో? కన్నులో? మృగియో? యెఱుంగ
సత్యమీమూఁటను చను ముగ్ధదృష్ట్లు

౬ చెడుబొమల్ వంకర నేయకుండినను
పడఁతి కన్నులు నన్ను వడఁకింపకుండు

౭ సుదతి గబ్బి చనుల సొంపారు చేల
మదకరి మొగమున మలయు పటమ్ము

౮ కలన నెదుర్పఁ బగఱు జంకు కడిమి
చెలువ నెన్నుదుటికిఁ జెడి జంకెఁగాదె?

౯ మృగికైవడి బెదరు దృష్టులు లజ్జ
నెగడు నీమొగు వేఱు నెఱి నగ లేల?

౧౦ కలు త్రావువారికే గాక కామంబు
వలెఁ గాంచినంత వైవశ్యంబు నీదు.

## ౧౧౦ జా డ రా బు క

౧ ఇప్పుడంతికి రెండు దృష్టులు గలవు
నొప్పించు నొండొండు నొప్పికి మందు

౨ నేమాని నవ్వు డా నెలఁత చూచుటలు
కామంబు సాఁబాలు కాదు మిక్కుటము

౩ చెలి కనెఁ గని సిగ్గుచేఁ దలవంచె
వలపు పైరున కది వైచిన నీరు

౪ నేఁ జూచునపుడు తా నేలను చూచు
నేఁజూడకున్న నవ్వేలయించుఁ జూచి

౫ సూటిగాఁ జూడక సురిగించినట్లు
పాటిగా నొకకంటఁ బరికించి నవ్వు

౬ అరయిక లేని యట్లాడినఁ బ్రేమ
పొరయు నర్థము నందు పొందనా నిజము

౭ కటువుపల్కులు పగకరణిఁజూచుటలు
పటుతర ప్రేమంబు పగిదిఁ జూపుటలు

౮ తపియించి నేఁజూడఁ దలరక నవ్వుఁ
జపలాక్షి యది మది జాడఁ దెల్పుటలు

౯ ఎఱుఁగని పోల్కి నుపేక్షించి చూచు
టరయఁ బ్రేమము గలయుచటనే గలుగు

౧౦ కనుఁతోఁ గన్నులు కలియునయేని
కన నోటిమాటలఁ గలదె ఫలమ్ము?

## ౧౧౧ కూడిక కాని యాట.

౧ కని విని తిని తాఁకి గంధమ్ము గనుట
కననైదు విషయ సుఖము లిటఁగలవు

౨ ఏ నొవ్వికైన మందెన్న వేఱగును
ఈ నొవ్వికీమెయే యితరంబు లేదు

౩ తన ప్రియురాలి మెత్తని మూఁపు మీఁదఁ
గునుకుటకంటె వైకుంఠంబు ప్రియమె?

౪ దవ్వైనఁ గాలుచు దాయఁ జల్లనగు
నివ్విచిత్రాగ్ని నెయ్యెడఁ బొందె నీమె?

౫ తలిరుఁబోఁడి భుజాలు తమి మీఱువేళ
వలచిన యవి వచ్చి వలచుటఁ బోలు

౬ తాఁక జీవము లెప్డుఁ దలిరుచుచుంటఁ
దాఁకఁదగిన యమృతంబయాఁ గేలు

౭ తన పోష్య వితతికిఁ దగఁ బంచి కుడిచి
కను ముదంబును బోలుఁ గనకాంగి పొందు

౮ గాలికే నెడమీని కడు చిక్కనైన
మేలి చేరిక యింపు మేకొల్పు మాకు

౯ అలుగుట తేఱుట యవలఁ గూడుటలు
గలుగుఁ గాముకుల చొక్కపు సుకృతముగ

౧౦ తెలియఁ దెలియఁ గ్రొత్త తెలిసిన యట్లు
కలియఁ గలియఁ గ్రొత్తగా నగు నింపు.

## ౧౧౨ చెలిమి మెచ్చి పలుకాట

౧ మృదులవు పొగడ విరీ! నీవు మఱియు
మృదుతర దేహ మామెలఁత నీకన్న

౨ హృదయమా! యీతరళేక్షణ కనులఁ
బదుగురు కాంచు పుష్పములతోఁ బోల్తె?

౩ కిసలంబు రంగు మౌక్తికము:లు పండ్లు
వసమెయి గంధంబు బల్లెముల్ కనులు

౪ కలువ లీక్షించుచోఁ గనకాంగి కనుల
పొలుపెంచి సిగ్గుచేఁ బుడమిని కాంచు

౫ తొడిమతోడఁ బొగడ తుఱుమునఁ జెరివె
నడుమున కింకఁ బణవ వాద్య ములియు

౬ కలికి మోమును నెలఁ గాంచి భేదంబు
తెలియ కక్లై నిల్చెఁ దివిరి తారకలు

౭ అడరుట యఱుట యున్నట్టి చందురున
కడరు మచ్చగలదె యతివ మోమునను?

౮ నెల! నీకు శ్రేయోస్తు! నెలఁత మోము వలె
వెలుఁగులు వెలయింపఁ బ్రేమింతు నిన్ను

౯ నెల! యీ సరోజాక్షి నెమ్మోముఁ బోలఁ
దలఁచిన మాను మందఱ దృష్టిఁ బదుట

౧౦ పొగడ పూవులు తెలి పులుఁగు టేఁకలును
మగువ పాదములకు మహిఁ బల్లెరులగు.

## ౧౧౩ మోహాతిశయ ప్రకటనము

౧ పెరతేనె పాలు గల్పిన యట్టులుండు
వర మృదు భాషిణి వాతెఱ తేనె

౨ ఒడలితోఁ బ్రాణంబు లోడఁ గూడినటులు
పడఁతితోడి చెలిమి పడసియుండుటలు

౩ ఓకంటిపాప! నీవొదుగుము నుంత
నాకల్కి నిల్వ స్థానము వేఱు లేదు

౪ పడఁతితోఁ గూడిక బ్రదుకుగాఁ దోఁచు
నెడఁబాటు చావు రహింగను పట్టు

౫ మఱచుటే యెఱుఁగ నీమడఁతి గొనముల
మఱచిన యప్పుడే మరలఁ దలంతు

౬ కనులలో మెదలుచుఁ గాంతుండు కలఁడు
కనులార్ప నొవ్వుండు కడు చతురుండు

౭ కనులలో నుంటచేఁ గాంతుండు మఱుఁగు
గొనునని కాటుకఁ గొనకుందు నేను

౮ ప్రియుఁ డెద నున్నాఁడు వెట్టయౌనంచు
భయమున నే వేఁడి వస్తువుల్ దినను

౯ కానరాఁడని యేను కను మూయ నెఱతుఁ
గాన నిర్దయుఁడని కడు నాడు జనము

౧౦ ఎద నెల్లపుడు వసియించు నాప్రియుని
వదరెఁ గఠినుఁడని పగ నూరి జనము.

## ౧౧౪ సిగ్గు వీడుట

౧ తాళాశ్వ మెక్కుట దక్క వేఱొండు
కాఱిలదు తెరువెందుఁ గామాతురులకు

౨ ఎడతాళ కును ఱోడ ఖ్లిచ్ఛించె సిగ్గు
విడిచి తాళాశ్వంబు వెస నెక్కనేఁడు

౩ కలిగియుంటి బిడెంబు ఘన పౌరుషంబు
తలచితి నేఁడెక్కఁ దాటి గుఱ్ఱంబు

౪ కడు సిగ్గుతోఁడి మగంటిమఱ తెప్ప
నెడగాని యేగెఁ గామేచ్ఛ యఱ తటిని

౫ తాటి గుఱ్ఱము నిసిఁ దలరు తాపంబు
నీటులాఁడి యొసంగె నేఁటికి నాకు

౬ కూరుకొల్లవు చెలికొఱకు నాకనులు
ఈ రేయి తాళాశ్వ మెక్కుట నిజము

౭ మోహ జలధిలోన మునిఁగియుఁ దాళ
వాహ మెక్కని చెలువల పుట్టు లెస్స

౮ మట్టు గుట్టెఱుఁగక మర్యాద మీఱి
రట్టు కెక్కిన దింటరంపుఁ బెన్వాలవు

౯ ఎవరు నన్నెఱుఁగర యనుచు నావలపు
తవిలి నా యెడనే సదా యేఁచి నుడియు

౧౦ కడు వెతల్ మావలెఁ గాంచనివారు
నడువీథి మము గాంచి నవ్వుచున్నారు.

## ౧౧౫ ఆడికో తెతేఁగి పలుకుట

౧ నిలిచిన వసువులు నిడు దూఱుతోడఁ
బలువు రెఱుఁగ రద్ది భాగ్యవశమున

౨ ఆరాము మేలిమి నరయక జనము
లాడు దూఱుగ నన్ను యాడిపోసికొను

౩ ఆడికో ల్నయమయ్యె నబ్బని చెలియుఁ
గూడిన లలి నింపు గూర్చె నామదికి

౪ అగడుచే నగడొంది యడరె నావలపు
అగుఁగాక! కాకున్న నడఁగును స్రుక్కి

౫ కై పెక్కు గొలఁదిని కల్గించు కరణి
తీవగు వలపును తెల్లమౌ గొలఁది

౬ నాతిఁ గాంచిన దోకనాఁడె యాడికయె
కేతువు చంద్రు గ్రమింగిన చందమయ్యె

౭ ఎడపక యాడికో లెరువుగాఁ దల్లి
నుడువులు నీరుగా నొవ్వి వర్ధిల్లె

౮ అగడుచేఁ గామార్తి నార్పఁ బూనుటలు
తగ నేతిచే నిప్పు తగ్గ నార్చుటలు

౯ వెఱవకు మని పల్కి పెక్కంద్రు నవ్వఁ
దొఱఁగ సిగ్గిలనేల దొరయు నాడికకు?

౧౦ వలచిన యాడిక వఱలె నీయూరఁ
వలపుకాఁడును వేఁడ వచ్చు నియ్యెడకు.

## ౧౧౬ వియోగతాపము

౧ అరుగమి కలదేని యనుము నాతోడ
త్వర రాక బ్రదికిన తరుణికి ననుము

౨ కలదు ప్రేమము ప్రియుకను చూపులందు
కలదు కూటమి నెడ గలుగునట్టి భయము

౩ ఎడఁబాయుమని మాట యిచ్చిన వారె
ఎడఁబాయ నమ్మక మే యరుదయ్యె

౪ అడలకుమని నమ్మ నాడిన వారె
ఎడఁబాయ నమ్మినయెడ దోసమున్న ?

౫ కాపాడు దేని నా కాంతుని పోక
నాఁపుము వీడిన నరిది కూడుటలు

౬ కని వీడు పలుకాడు కఠినుఁ డౌనేని
ననుపు గలాఁడని నమ్మంగఁదగదు

౭ అంజక యెడఁబాయు టతనికి మున్న
ముంజేతి గాజులు మొనసి తెల్పవోకో ?

౮ ఇంపుగాదది మిత్రు లెనఁగని యూరు
ఇంపుగా దిసుమంత హితు నెడఁబాటు

౯ కాల్చుట గాదు తాఁకఁగఁ గాల్చు నగ్గి
కాల్చునే దవ్వైనఁ గామంబు కరణి

౧౦ ఎడయిక కోడఁబడి యెడఁ దాప మడఁచి
కడవుచున్నారు పెక్కండ్రు జీవితము.

## ౧౧౭ వంత చేఁ గృశించుట

౧ అడఁచు కొలఁది వియోగార్తి నా యెడఁద
నడరెఁ జెలమ చల్లనగు తేటవోలె

౨ చలపట్టి వెత దాఁప శక్యంబుకాదు
తలఁపుఁ దెలుప సిగ్గు తలయెత్తనీదు

౩ వలపును సిగ్గునోర్వని మేనఁ బ్రాణ
ములు దండెగా సమముగఁ దూఁగి నిల్చె

౪ కలది యొక్కటె వల కడలి యద్దానిఁ
దలకడచి తరింపఁ దరి యొండుఁ గాన

౫ పగమేర చెలిమిత్రోవని చూపువారు
పగమేర మఱి యెంత వడి చూపువారో?

౬ కడలియంతగు నింపు కలయికయందు
ఎడఁబాటునం దంత కెక్కుడౌ వెతలు

౭ తమి సముద్రమునీఁది దరిగాన కొంటి
శ్రమియించి రేయి నిద్రయె లేక యుంటి

౮ అన్ని ప్రాణుల నిద్ర కంపిన రేయి
కెన్నఁగా లేరు తో డేఁదక్క నిప్పుడు

౯ కడు దీర్ఘములగు నీకాలంపు రేలు
కడుఁ గ్రూరములు ప్రియు క్రౌర్యంబుకంటె

౧౦ చెలువు నెడకు నెద చెలువునఁ గనులు
వెలలునే నీఁదునే వెల్లువ నిటులు?

## ౧౧౫ కన్నుల పరితాపము

౧ ఇవి చూపియేకదా యీ నొవ్వి గలిగె
నవలఁ జూపుమని యిట్లడలంగనేల ?

౨ ముందరయక చూచి మురిసిన కనులు
వందురు టిప్పటి వహిం దేనిఁ దలఁచి ?

౩ తవుదు మంచప్పుడు తమిఁ గాంచి యిపుడు
నవయు చుండెడి చెయ్యి నగుబాటు కాదె ?

౪ ఇట్టి తీఱని వెత నెసఁగించి యిపుడు
పట్టుగా నీర్వట్టఁ బలపించుఁ గనులు

౫ కడలికంటెను పెను కామ తాపంబు
నడరించి నిదురింప కడలెడిఁ గనులు

౬ కామ వ్యథను నాకుఁ గలిగించు కనులు
తాము నిట్లగుట యెంతయు నింపు కాదె ?

౭ వలచి వలచి కాంచి వలగొల్పు కనులు
తలఁచి తలఁచి వంతఁ దపియించుఁగాక !

౮ పలుకుల మాత్రన వలచిన యతఁడు
కలఁడు కానకతనిఁ గను లడలెడిని

౯ చేరిన యపుడును చేరని యపుడుఁ
గూరుకు నొందక కుందెడిఁ గనులు

౧౦ తుదుముఁ బోల్కన్నులు దొరయు నావంటి
యొడఁదలోని మఱుఁగు నెఱుఁగుట సుళువు.

## ౧౧౯ పాలి పరితపించుట

౧ ఎడఁబాటు నొందఁబడ్డ యే నిప్పు డెవరి
కడ మొఱలిడుదు నా కడగండ్లఁ బాలి

౨ దయితుఁ డొసంగెనట తగవుచే వెలుక
పయిపయి నా మేనఁ బర్వెన దిపుడు

౩ వెతయు వెల్కయు నిచ్చి విసిమయంబుగను
హితుఁడు సౌందర్యంబు హ్రీయును కొనియె

౪ అతనినే వినుతింతు నతనినే తలఁతు
వెతలంది పాలిన వితము మోసమ్మొ

౫ చెలువుఁడు ననువీడి చెలఁగు టచ్చుటను
వెలుక నా మేనొందు విధము లిచ్చుటను

౬ వలపుకాఁ డెడఁబాయఁ బాలుడు డాయుఁ
వెలఁగు దీపము తగ్గఁ జీఁకటి కరణి

౭ అలమి చేరిక నుంటి నవలి కేగితిని
అలమిన దక్కటా యంతలో వెలుక !

౮ ఈమె పాలినదని యెగ్గించువారు
తా మోసగించుట తలఁపంగఁబోరు •

౯ నయమాడి నతఁడు సన్మతియయ్యెనేని
మెయి యెల్ల వెలుక క్రమ్మిన నేమి లెక్క ?

౧౦ నీతి లేదని ప్రియు నిందింపరేని
ప్రీతియే పాలె నన్ వేరొందుటయును.

## ౧౨౦ ఏకాంత వేదన.

౧ వలచియు వలపింపఁబడు వారె గింజ
యలరని వలపు పండనుభవించెదరు

౨ ప్రియురాండ్రకుఁ బ్రియులు ప్రియము చేయుటలు
మొయిలు కురిసినట్లు మొగిఁ గర్షకులకు

౩ వలచియు వలపింపఁబడు చెలువలకుఁ
గలదు సుఖము నొందఁగలమను దిటవు

౪ వలపింపఁబడువారు వలవకయున్న
వలచిన సతులు శుభములందు టరిది

౫ వలవకుండిన వారి వలచినఁ దమకు
వలచి యవ్వారేమి ప్రమదంబు నింత్రు ?

౬ వలపొకవంక నొప్పఁగ లేదు సొంపు
చెలఁగి కావడి బద్ద చెలువున్న నింపు

౭ నా వంకనే పోరు నడపు నీమరుఁడు
నావెత నుంత కానండు గాఁబోలు

౮ ప్రియుల యింపగు వాక్కు వినకుండ బ్రదుకు
దయితలకంటె నిద్ధర ధీర లెవరు ?

౯ వలపింపఁ బడువారు వలవ కుండినను
పలుకొక్కటైన నొప్పఁగ వినుటించు

౧౦ వలవని వారితో వగఁ జెప్పకంటె
నలజడి యిటువడు టదిమేలు మనమ !

## ౧౨౧ పలవరము.

౧ తలఁచిన యంత సంతస మిచ్చు కతన
వలపు మద్యముకంటె వర మోదకరము

౨ వలపుకానిఁ దలంప వచ్చు ముప్పేది ?
ఎలరుపై గను వల పెయ్యెడనేని

3 అడరినట్లే లేచి యడఁగెను తుమ్ము
ఎడ నెంచి నల్లించి యెంచఁడో ప్రియుఁడు ?

౪ ఉన్నాఁడతండు నా యుల్లంబునందె
ఉన్నానో లేనో యా యుల్లమం దేను

౫ ఏనా యెదం దూఱనీక కాపుంచి
తా నా యెదంజేరు తమికి సిగ్గిలఁడో ?

౬ కలిసి యుండిననాళ్లు కడుఁ దలపోసి
యిల మంటి లేకున్న నేమౌదు నొక్కొ ?

౭ మఱపెఱుంగక తలంపఁగ మదిఁ గాల్చు
మఱచిన నింక నేమౌడ్కి నగుదునో ?

౮ చెలువుఁ డెంతగఁ దలంచినఁ గినియండు
వలపుకాని చనవు వలనట్టిదె కద !

౯ ఎడయమున్న యతని యెద బిగిఁ దలఁచి
కడు తీపి ప్రాణముల్ కంగారు పడెడి

౧౦ ఎద పీడ కరుగు ప్రాణేశుఁ గన్నారఁ
గోద లేక కాంచంగఁ గూర్కెవో మనమ !

## ౧౨౨ కలవరము.

౧ వలపుకానిని దూతినలెఁ గొని తెచ్చు
కలకేమి సేవింతు గావింతు నిపుడు ?

౨ హితమతి నాకను లింత నిద్రిలిన
వెతలెల్లఁ బ్రియునకు వినిపింపనగును

౩ మెలఁకువలోనఁ బ్రేమింపని ప్రియుని
కలలోన ననువులు గాంచుచు నిలిచె

౪ మెలఁకువలోనఁ బ్రేమింపని ప్రియుని
కలిపిన కలయెడఁ గదు ప్రేమ గలిగె

౫ కన్నప్పు డింపు జాగ్రత్తలో సుఖము
కన్నప్పుడే యింపు కలలోని సుఖము

౬ మెలఁకువ యొందు భూమిని లేదయేని
కలలోనఁ బాయందు కాంతుండు నన్ను

౭ మెలఁకువలోనఁ బ్రేమింపని యతఁడు
కలలోన నేతెంచి కారించు టేల ?

౮ కనుమూయునంత నా కౌఁగిలి గొనును
కనువిచ్చునంత గ్రక్కున నెద నడఁగు

౯ మెలఁకువలోనఁ బ్రేమింపని ప్రియులఁ
గలలోనఁ గనలేని కలుకు లేమతురు

౧౦ మెలఁకువలో వీడి మెలఁగె నన్వారు
కలలోనఁ గాంచరు గాఁబోలు వారు.

## ౧౨౩ ప్రొద్దుఁగని పొగులుట

౧ విరిసంజయూ? కావు విరహుల యుసుఱు
కరమాను వీరఖడ్గంబవు ప్రొద్ద !

౨ మరులొందు మాప? మా మాడ్కిని నీవు
విరహిణివో నీదు ప్రియుఁడుఁ గట్టెఁడిరో ?

౩ వడఁకుచు వచ్చె నెప్పటి మాపు నేఁడో
అడర దుఃఖము ప్రళయంబు నా వచ్చె

౪ చెలువుఁడు లేమి నీ చెడు మాపు వచ్చెఁ
గొల కలనికి వచ్చు క్రూరుని రీతి

౫ ఏమి మేల్చేసితి నేను ఱేపునకు ?
ఏమి కీడెంచితి నేను మాపునకు ?

౬ మునిమాపు చెడుగు సల్పుటలు ప్రియుండు
నను వీడి చనెడి మున్నడి నే నెఱుంగ

౭ ఱేపట మొగ్గయై ఱేకెత్తి పగలు
మాపట వికసించు మరులను పూవు

౮ గోపాల వేణువు కొఱవి మాపునకుఁ
గోపారు దూతయై కొల కైదువయ్యె

౯ మది మరులొల్కను మాపు మలయు జనములు
పొదలెడి పెనుచింతఁ బొందుచున్నారు

౧౦ చెడని జీవము లర్ధ చింతకుఁ దలఁచి
చెడుచుండెఁ గలఁత హెచ్చిలు మాపువేళ.

౧౨౪ అ వ య వ కా ర్శ్య ము

౧ ఎడచేసి చాలదవ్వేగిన ప్రియుని
తడవి యడలి కనల్ తమ్ముల కోడె

౨ చెలువు నిర్దయం దెల్పు చెలువున నుండె
జలము రాల్చుచుం బాలి ప్రసగ్గిన కనులు

౩ చేరిన నాళ్లుబ్బు చేతు లీయెడను
చేరమిం గదుం దెల్పు చెలువున నుండె

౪ జోడు వీడంగం దన సొగసెల్ల వీడి
వాడి గాజులు జాఱ వ్రాలె భుజములు

౫ వలయముల్ జాఱ సొబగు వీడి కేలు
చెలువు క్రౌర్యము విప్పి చెప్పుచున్నయవి

౬ వలయముల్ జాఱం గేల్వాడంగాం బ్రియుని
ఖలుండని జను లాడం గదు నొత్తు లోన

౭ వాడిన చేతుల పగిదిం గట్టెండికి
నాడి మేల్గూర్పు శక్యమె నీకు మనస!

౮ ఆలింగనమునం గాసంత కేల్సడలం
బాలిపోయెను గదా పడంతికి నొసలు

౯ గాలి దూరెడియంత కౌంగిలి వదలం
బాలె నీరొలికిన పైదలి కనులు

౧౦ తన పొరుగు నొసలిం దాంకిన వెలుకం
గనుల వెలుక కాంచి కడు దుఃఖమందె.

## ౧౨౫ తనలోఁ దా నాడుకొనుట

౧ తీరని యీనొవ్విఁ దీర్చు మందొకటి
యారసి చెపు మెట్టిదైనను మనస!

౨ నీయెడఁ జెలికాఁడు నిర్దయు చూప
నీయేడు పజ్ఞతయే చుమ్ము మనస!

౩ ఇట నుండి తపియింప నేమి ఫలమ్ము?
వటగ మానసమందు వగపు గూరుపదు

౪ కనుల నీతోఁ గాంతు కడకుఁ గొంపొమ్ము
మనస! చూపుమని నక్కమాడ్పి తిన్పుండు

౫ వలచిన వలవని వానిని మనస!
తలఁచి యప్రియుఁడని తగునె చేవిడఁగ?

౬ కలిసి వీడిన కాంతుఁ గని చేరఁబోవు
పొలయుల్కఁ గొనియుందు ములుచ మానసము!

౭ వలపేని సిగ్గేని వదలు మీరెండు
చెలఁగ సైఁపఁగలేను చిన్నారి మనస!

౮ ఎడఁబాసి మఱితేర్ప నెంచని యతని
బడిఁబోదు వేమందు భ్రాంత మానసమ!

౯ చెలువుఁడు నీలోనఁ జెలఁగుచు నుండ
వలయుచుఁ బాఱ దెయ్యతని దగ్గఱకు?

౧౦ కదిసి వీడినతఁడు కలఁడు డెందమునఁ
గుదిసితి మింకను కుదియుచుండుదము.

## ౧౨౬ నిలుకడ చెడుట

౧ చెలి! లజ్జ గడెగల శీలమను తలుపు
వలపు గొడ్డలి నేఁడు పగులంగఁ గొట్టె

౨ కనికర మది లేదు కామంబునకును
పనిగొను నెదనుండి పడు నడురేయి

౩ వలపు నే దాఁపంగ వలతుఁ దాఁ దుమ్ము
వలె నన్ను మించియే బయలుబ్బుచుండు

౪ తలఁచుచుంటిని నేను తగు ధీర ననుచు
వలపు మఱుఁగు దాఁటి బహిరంగపడెడి

౫ వలపు కాండ్రేగ వెంబడిఁ బోని తగవు
చెలువ లెఱుఁగఁ దగు చెలువంబు కాదు

౬ వదలిన వారి వెంబడిఁ బోవఁ గోరి
యెదయొందు తాప మదెంత లెస్సయ్యో?

౭ వలపుకాఁ డిటువచ్చి వలపు తలఁపులు
కలయఁ గూర్చిన సిగ్గు గన నైతి గాదు

౮ స్త్రీయోర్పు నిలుకడఁ జెఱుచు కైదువులు
మాయి చెల్వుని కల్ల మాటలు గావా?

౯ అలుగఁ దలఁచి దూర మఱిగియు మనసు
కలియ నువ్విళ్లూరఁ గౌఁగిలించితిని

౧౦ సెకఁ గ్రొవ్వువలె మృదుచిత్తంబు కరఁగ
సఖుఁడు కూడఁగ నల్గి జరగ శక్యంబె?

## ౧౨౭ ప్రోషితుల కోరికలు.

౧ వెడలిన నాళ్లెంచి వ్రేళ్లఱిగినవి
కడుఁజూచి కన్నులు కాంతి వీడినవి

౨ చెలువు నేఁ డెదలోనఁ జింతింపకున్న
వలయంబు లూడ సొవను వీడుఁ గేలు

౩ గెలువంపుటాస నేగిన మనోహరుఁడు
మలఁగు నన్నాసమై మనియున్నదాన

౪ ఎడమైన వలపుకాఁ డెక్కడు వలపు
వడి వచ్చునని చెట్టుపై కెక్కె మనసు

౫ కనులారఁ గాంతుని కాంచెదఁగాక!
కన నన్న కేలి వెల్కయుఁ దొలంగెడిని

౬ ఒకనాఁడు ప్రియుఁడిట కొగి వచ్చుఁగాక!
వికటించు తాపంబు వీఁగ సుఖింతు

౭ కనువోలు కాంతుండు కదియ నల్గుదునొ?
పెనఁగుదునో? కేలిఁ జేర్చి చొక్కుదునొ?

౮ జయమొందుఁగాక మాజన నాథు వెంట
ప్రియురాలితో మాపు విందారగింతు

౯ పరదేశ మేగిన పతి వచ్చు గడువు
తెలియ కొక్కటి పెక్కు దినములై తోఁచు

౧౦ మలఁగియు డాసి యుగ్మలిఁ గాఁగిలించి
ఫలమేమి యెద ప్రీలి పడి చచ్చు పిదప.

౧౩౮ భావప్రకటనము.

౧ కడు దాఁప నొప్పక కాటుక కనులు
వడిఁ జెప్పఁబూను భావం బొందు కలదు

౨ కను నిండు సొబగు చొకాటంపుఁ గేలు
చను నింతి కలరు నైజపు గోలతనము

౩ పూసలో దారంబు పొడగను నట్టు
లీసతి యందమం దిమిడు నొక్కఁడు

౪ విరి మొగ్గలోఁ దావి విరిసెడునట్లు
చిఱునవ్వు మొగ్గలోఁ జెలఁగు నొక్కఁడు

౫ బిగువు గాజులు గల వెలఁది తళ్కులను
మిగులు దాపము నార్పు మేటి మందొప్పు

౬ సంతసంబున ముంచు సంగమ మకట!
కాంతుఁ డెడయు నను కలఁతఁ గల్గించు

౭ చల్లని మది గల సఖు నెడఁబాటు
తెల్లంబుగా మున్నె తెలిసె గాజులివి

౮ ఎడఁబాసినది నిన్న నే సఖుం డొడలి
కెడ తాఁకి వెలుకమై యేడు నాళ్లయ్యె

౯ కని కంకణంబులఁ గని వాడు కేలుఁ
గని యడుగులు చెలి కనఁజేసె నెడఁద

౧౦ కన్నుల మఱుకాఁక కనిపించి వేఁడు
టన్నుతనంబులో నన్నుతనంబు.

## ౧౫౯ సురతవాంఛ

౧ తలఁప నానంద ముత్సాహంబు కాంచ
వలపున కలరు నొప్పదు మద్యమునకు

౨ మత్తిచెట్టంతగా మలయుచో వలపు
కొత్తిగిం జంతేని కొఱలరా దెడపు

౩ మనసీక వలచని మాడ్కి నుండినను
కనులు నా వలకానిఁ గనకుండ లేవు

౪ చెలువుఁడు చేరరాఁ జెలి! యల్గనుంటిఁ
గలయఁ బర్విడె మది కడఁకను మఱచి

౫ కనలేవు వ్రాయుచోఁ గలమును కనులు
కనలేవు కాంచుచోఁ గాంతు దోసములు

౬ కనుచో నశసి తప్పు కానంగ లేను
కననిచో నెగ్గు తక్కఁగఁ గానలేను

౭ మునుచు వెఱిఁగి యేట మునుఁగు వారివలెఁ
గొనలేని కినుకను గొని ఫలమేమి ?

౮ నగుబాటు కలిగించినను మత్తు లాసఁ
దగులు కల్లును పోలు దయిత! నీఱొమ్ము

౯ వలపు మార్దవము పుష్పముకంటె దాని
లలిత పక్వమ్ముఁ గొలఁదిమంది కాంత్రు

౧౦ కనులతోఁ గినిసి నాకంటె నాత్రమునఁ
బెనఁకువయందు నాప్రియ ముందుపడియె.

## ౧౩౦ మనసుపైఁ గనలుట

౧ హృదయమా! అతని కోరిక మేర కతని
ఎదయుండ లోఁబడ కేల యిట్లుందు?

౨ హృదయమా! కటికి యంచెఱిఁగియుఁ గినుక
గదురఁ డంచతని దగ్గఱ కేగ దేల?

౩ చెడిన వారలకు నెచ్చెలులు లేరనియొ
వెడలెద విచ్చమైఁ బ్రియువెంట మనస!

౪ మనసా! అలుకఁబూన్ని మఱి కూర్పఁబోవుఁ
నిను గాని యోచింతునే యిట్టి వింక!

౫ క్రూడమి కడలును కూడిన యపుడు
వీడు నంచడలు; నొవ్వియె మదికెపుడు

౬ తినునది పోలె బాధింపనే యుండె
మనసు నే నొంటిమై మననంబు సేయ

౭ అతని మఱవలేని యల్పగుణంవు
మతిఁగూడి సిగ్గును మఱచితి నిపుడు

౮ తెగడ నల్లిదమని దిటవరి గుణమె
పగటుచు నున్నది బ్రదుకాన మనసు

౯ కీడు వచ్చిన తఱిఁ గేలిచ్చు మనసె
తోడు రాకుండఁగాఁ దోడెవ్వ రింక?

౧౦ తఱిరాఁగఁ దనయెద తనకుఁ గానపుడు
పొరుగు లేదనుట నవ్వులచేటు కాదె?

౧౩౧ పొలయలుక

౧ వలపుకాఁడొందు తాపం బింత కంద
మలుకఁ బూనుము కౌఁగిలానసీయకుము

౨ పొలయల్క మిఱియు నువ్వును పోలఁదగును
వలదైన ననదైనఁ బరితృప్తి నిడదు

౩ మచ్చిక నలుగు చామలను వీడుటలు
నొచ్చినవారిఁ బై నొప్పించు టగును

౪ చేడల కినుకార్చి చేరక విడుట
వాడిన తీఁగఁ ద్రుంపఁగఁ బూను టగును

౫ అలరు సద్గుణుల కే నందగించునది
పొలఁతులు వహియించు పొలయల్క గాదె?

౬ పెను కినుక పొలయల్క విరియని వలపు
పెను మగ్గు పండును పిందెను బోలు

౭ కలయిక దవ్వో దగ్గఱనో యింక నని
యలుకలోఁ గల దుబలాట మొక్కండు

౮ కలఁగె ననుచు నొవ్వఁ గని నన్ను కాఁచు
కలియనిచో మేలు గలదె నొచ్చుకొని?

౯ ఇంపగు నీడలో నెసలారు నీరు
ఇంపగు వలపున్న యెడనె యల్కయును

౧౦ అలుగువారిని వీడి యరుగు వారలను
కలియఁగోరఁగఁ దమి కతమగుఁ గాదె?

౧౩౨ పాలయాలుక వాఁడిమి

౧ చపల నేత్రలు నీ విశాల వక్షమును
త్రప లేక కనుట యోర్వఁగఁజాల నేను

౨ కినుక నేఁ గొనఁ బలికింపఁగాఁ జెలువుఁ
డనువునఁ దుమ్మెఁ జిరాయు వౌనంటి

౩ విరిదండ నిడికొన వేరొర్తు కాంచి
మురియఁ దాల్చితి రని మొనసి కోపించె

౪ ఇయ్యెడఁ బ్రేమ నా కెక్కుడనంగ
నెయ్యెడకంటె నంచెడసి కోపించె

౫ ఈమెయి నెడఁబాయనే పాయ మనిన
నామెయినో యని యశ్రువు ల్నించె

౬ తలఁచితినన్న నంతకు మఱపనుచు
నలిగి కౌఁగిలి యీక యవలికేగినది

౭ తుమ్మఁగా దీవించి తొర నేరిఁ దలఁచి
తుమ్మితి రని యేడ్చెఁ దొయ్యాలి యలిగి

౮ తుమ్మఁ జింతిలునని తుమ్ము నాఁపితిని
తమ్మెంచువారిని దాఁచి రంచేడ్చె

౯ ఓదార్ప, వలచిన యువిదల నిట్లె
యోదార్తువే యని యుడికి చింతిల్లె

౧౦ తవిలి దగ్గఱనుండి తలఁచి కన్నున్న
నవతెఁ దలఁచి కాంతు రిట్లని కినిసె.

## ౧33 అలుకచే ఆనందము

౧ తనయెడ దోసంబు తనరకుండినను
పెను ప్రేమ గొన మేటి వెరవగు నలుక

౨ అలుకచే వెత యల్పమైనను మేటి
వలపు వాడి మిగుల వర్ధిల్లుఁ గాదె?

3 జలము నేలయుఁ బోలి చనువారు పొందు
పొలయల్కవోలె స్వర్గ్యసుఖ మున్నె?

౪ అలము సుకము వెంచు నలుకయం దెడఁదఁ
గలఁచి పగిల్చెడు కైదువు తోఁచు

౫ యువతులు తప్పు లేకున్నను కినిసి
కవుఁగి లీకున్నను కలదం దొకందు

౬ తినుకంటెఁ దినినది తేయుట యింపు
కన లింపు వలపునఁ గలయికకంటె

౭ పొలయల్కయం దోటు పొందినవారె
గెలుతు రయ్యది మరు కేళిలోఁ దెలియ

౮ నొసలు చెమర్చ మానుగఁ గూడు హాళి
పొసఁగునొకో? మరలఁ బొలయల్క నొంద

౯ పైదలి యలుక మెప్పటి పొందుఁగాక!
ఓదార్ప నిడు రేయి యొప్పును గాక!

౧౦ పొలయల్కయే వలపున కిచ్చు నింపు
మలిపొందు నది కూర్చ మఱియు సొంపహహా!

—:★:—

# లఘు వివరణము.

పద్యము.

౯ అష్ట గుణములు:— స్వతంత్రత, విశుద్ధదేహము, నిరామయాత్మ, సర్వజ్ఞత్వము, అనాదిబోధము, అలుప్తశక్తి, అనంతశక్తి, తృప్తి అని శైవాగమము; అనంతజ్ఞాన, స్వరూప, వీర్య, ప్రేమ, నామరహిత, గోత్రరహిత, ఆయూరహిత, అవినాశ స్వభావములని అర్హత మతము.

౨ మృతినొందువారి లెక్కించుట = వ్యర్థశ్రమము అశక్యమని భావము.

౩ ద్వయాగతులు = జనన మరణములు. ఉండె = ఉన్నది.

౪ ధీస్పృణి = బుద్ధియను అంకుశము. నాగము = ఏనుఁగు.

౫ ఎడతాయి = అడ్డు

౩ అతఁడు = తాను. ౪ పంచి = మూడవ పద్యములోని ప్రకారము భాగించి.

౯ కన్నది = కన్నతల్లి.

౧ ఒడికాన = ఉపాయముతో.

౪ నిల్చినది బిడ్డలు చూ ౭. ౩.

౬ ఈగి = దానము.

౪ ఇడుము = సంకటము.

౧ వెఱ్ఱుయు = పిచ్చివాఁడు. ౯ మసి = కల్మషము.

౧ గొద = అంకెలి, బదరికము = పెట్టె.

౯ ఎఱుకలేవడి = బుద్ధిహీనుండు దరిద్రుఁడు.

౧ పొల = మాంసము. అసమి = తినకుండుట.

౨ వేదబము = వేషము. ౪ లింగి = బ్రదుకుకొఱకు సన్యాసి వేసము వేసినవాఁడు. ౭ కోలము = వేసము.

౪ పగటు = వెల్లడించు ౬ సురాళిము = కోపము. తరణి = ఓడ.

౯ సతత హింస్రకులు = ఎల్లప్పుడు హింసచేయువారు.

34 ౮ పోతము = పక్షిపిల్ల. ౧౦ ఇమ్ము = అనుకూల నివాసము.

35 ౩ శబ్దాదులు = శబ్దస్పర్శ రూపరస గంధములు.

౯ తోడుకు = సంబంధము.

40 ౬ కలవానికడ బీదవడి వగచుc
తెలియువారల కడc దెలియనివాcడు (అని కొందఱు)

౯ ఇంచు = ప్రేమించు.

51 ౩ ఏపు = దోసము ౬ పట్టెcడుల్ = పట్టులేనివారు.

52 ౮ పసపఱుపందగు = అలవాటు చేయింపcదగును.

53 ౬ ఈవరి = దాత.

57 ౧ విధింపcబను = దండింపc దగును. ౫ వేదులు = వెఱ్ఱి.

౬ అనితటి = యుద్ధము కలిగిన వేళ. బెలుకుటి = వెలవెలపోయి

58 ౧ తొడుగు = కవచము.

77 ౧ మూలబలము, కూలిబలము, దేశసేన, అడవిసేన, తోడిసేన, శత్రు
(వులకో ను) సేన అను ఆఱువిధములు సేనాంగములు
ఇ తొల్వేల్వ = మూలబలము.

82 ౧౦ పిదపచెల్మి = నీచస్నేహము.

85 ౬ అంగకములకా = వస్త్రములచే (వేషముచే)

౯ కానివాడు కానుకానcడు. ఇతరులకుc దెలుపcబూనును.
అరయనివాcడు తొవరసి విన్నంత వఱ కరసినవాcడే యగును.

87 ౫ ఇష్టుcడు = జయింప సులభుcడు.

89 ౩ కుమ్మరి క్రైదువట్లు = సారెపై కుండలను కోయు కుమ్మరి
ఆయుధమువలె, సరాలన.

91 ౬ కరీరబాహులు = లేcత వెదురువంటి భుజములు.

౯ సోలపరి = ఒడలు మఱచినవాcడు.

92 ౧౦ ఈరెద = రెండు మనసులు.

95 ౧ మూcడు ప్రకృతులు వాత పిత్త శ్లేష్మములు.

౬ సోము = సుఖము. ౮ గదము = రోగము. నిదానము = రోగ
కారణము.

105 ౧ నెవ్వ = దారిద్ర్యము, 107. ౪ సీదరము = దారిద్ర్యము.

